ఓమ్.

# శ్రీ ఆత్మబోధసిద్ధేశ్వరశతకము

గ్రంథకర్త.

కే. రామస్వామి
ప్రధానోపాధ్యాయుడు
హింధూబోర్డు స్కూలు
కలమళ్ల.

మొదటికూర్పు 1000 ప్రతులు.

ప్రొద్దుటూరు.
శ్రీ జానకీముద్రాక్షరశాలయందు ముద్రితము.

1930.



వెల 0-4.




గ్రంథకర్త, శ్రీ రామస్వామి.

# పండితాభిప్రాయములు.

—o—

శ్రీమద్రామాయణ, బ్రహ్మాండపురాణ బ్రహ్మపురాణాది బహుగ్రంథకర్తలు
కావ్యస్మృతితీర్థ జనమంచి శేషాద్రిశర్మగారు, కడప.

ఆత్మబోధసిద్ధేశ్వరశతకము గ్రంథకర్తగారిచే సముపఁబ
డి నాకరంబలంకరించినది. అచ్చుప్రతియే నేఁజూచినది. అం
దందుఁ జదివితిని. ఇది పేరునుబట్టియే వేదాంతవిషయబోధ
కమని తెలియఁగలదు. గురువు నానతి నీసిద్ధేశ్వరశతకమున
దారచించినటు కవియే తెలుపుకొనియెను. గురుసేవామూ
మున వేదాంతరహస్యములఁ గొన్నింటిని గ్రహించినట్లు క
పట్టు. ఆంధ్రభాషాగురువులు కవిసింహబిరుదాంచితులు,
శతావధానులు, నగు రాజశేఖరులు. పెద్దలసేవించి సముపార్జి
చిన జ్ఞానసారమును మనస్సులోనే నశింపఁజేయక లోకో
కారముగునన్న యూహచే నీశతకమునల్లి భగవదర్పణము
యుట సమంచితమార్గమునెంచెద. ఈశతకము సీసపద్య
యము. మృదుపదములుగలది. ముద్రణస్ఖాలిత్యములు లో
గునవి కొన్ని యున్నవి. ద్వితీయముద్రణమున సవరింపఁ
ను. కవిత్వధోరణిబాగున్నది. వేదాంతము విషయము
నించుక గూఢముగా నర్థమందుఁ గనఁబడుట సహజ
ఐన నట్టితావులం గూడ నీకవి కడు జాగరూకుఁడై మెలంగె
వలయును. ఈశతకము పామరులకుంగూడఁ బరనార్థమై
విధముల శ్లాఘాపాత్రమై యెసంగుఁగాక, ఇట్టి గ్రంథ
నింకనురచించి గ్రంథకర్త జన్మభూమికి విఖ్యాతిని దెచ్చు

దీనిం బఠించి మానవులు భక్తిభరితస్వాంతులగుదురుగాక భగవంతుఁడగు శ్రీసిద్ధేశ్వరస్వామి యిక్కవిపుంగవున కాయురారోగ్యములు ప్రసాదించి పెంపొదించుఁగాక. కాలమును వృథసేయక యిట్టి శతకములను గావ్యములను రచించి లోకమునకు మేలుచేసి గ్రంథకర్త దిగంత విశ్రాంతయశుండగుంగాక.

ఇట్లు విన్నవించు విద్వద్విధేయుఁడు,
జనమంచి శేషాద్రిశర్మ.

—o—

శతావధాని పంచానన కవిసింహ జి. వెంకటశేషశాస్త్రిగారు.

ఆత్మబోధసిద్ధేశ్వరశతకము నామూలచూడముగఁ జూచితిని. గ్రంథములోని గుణముల లోకులకుఁ బరిచితములఁ జేయుతలఁపున నేనీనాలుగువాక్యలను వ్రాయుచున్నాను. మానవునకుఁ బ్రకృతివివేచనయేగాదు, పారమార్థికజిజ్ఞాసయు తి ముఖ్యమైనది. వేదములు, వేదాంతములు, సూత్రములు, గీతలు, లోనగునవెన్నియో మహోత్కృష్టగ్రంథములు వాని కైగలవు. కాని సామాన్యజనులకుఁగూడఁ దత్త్వజిజ్ఞాసయం దభిరుచిఁగలిగింప నీశతకమువంటివే ముఖ్యావసరముగానున్నవి. బ్రహ్మము, మాయ, జీవుఁడు, దేహము, ఇంద్రియములు, వృత్తులు, అవస్థలు, మొదలగువాని నీకవి యింటిలోనివస్తువులనుఁ దల్లి బిడ్డలకు నెఱిఁగించురీతినిఁ బాఠకులకు సుగమముగా నిరూపించియున్నాఁడు. వేదాంతబోధకములగు పద్యగ్రంథములలో నింతకన్న సరళశైలి నడచుట సర్వసాధారణముగాదు. భాషావిషయక మర్యాదలు చాలవఱకనుసరింపఁబడినవి. శా

స్త్రీయ తర్కములతోఁ గాక యనుభవసూక్తితోఁ నీగ్రంథము వ్రాయఁబడినదని రచనాపరిపాటియే తెలుపుచున్నది. "అధికారసంపన్నులే తత్త్వము విచారింపనర్హ" లనుకొనువారినిఁ గూడ సద్విచారమునకై యీగ్రంథము పురికొల్పుచున్నది. ఈతరుణములో లోకోపకృతికై తమకాలమును జ్ఞానమునుఁ గొంతవఱకు వినియోగించిన యీకవిగారి వ్యవసాయము శ్లాఘాపాత్రము. ఈకృతివలన పామరలోకము సత్ప్రవృత్తుల కభిముఖమై మేలందెదుఁగాక. ప్రోత్సాహితుఁడై గ్రంథకర్త లోకోపకృతికై పెక్కుకృతుల రచించుఁగాక. భగవంతుఁడీయన కాయురారోగ్యములఁ బ్రసాదించుగాక.

ప్రొద్దుటూరు. 21-8-30 | ఇట్లు, జి. వేంకటశేషశాస్త్రి.

—o—

విద్వాన్ కావ్యపురాణతీర్థ జనమంచి వేంకటసుబ్రహ్మణ్య శర్మ గారు.

"ఆత్మబోధసిద్ధేశ్వరశతకమును" జదివితిని. పద్యములు హృదయములై పరమార్థతత్త్వ ప్రతిపాదకంబులై యెల్లరకు సులభంబుగఁ దెలియఁదగిన లలితశైలిలోనున్నయవి. తత్త్వవివేచనము పద్యరూపముగ వినువారికిని జదువువారికిని నిండ సుగమముగనున్నదని యెల్లవారును నంగీకరింతురు. ఇట్టి లలితసరిణి వేదాంతార్థ విచారణంబు సలుపఁబూనిన నెట్టివారేనియు విషయలంపటులుగాక ముముక్షువులగుదురనుట నిస్సంశయము కాలముననుసరించి యిట్టి విదేశభాషలయంద

రచియించుట లోకమున కుపకృతిసేయుటయని నాతలంపు. వేదాంతరహస్యములు గీర్వాణభాషయందుండి సద్గురు ముఖంబున తెలుంగుఁదగియున్నను నిందు సరళముగఁ దెలుపఁబడియుండుటచే నియ్యది మోక్షమార్గమునకు నిశ్రేణికనాఁజెప్పనొప్పును. ఇట్టి యిక్కవి పలుగ్రంథములరచించి దేశఁబునకును భాషకును మిగుల వాసిగల్పించి లోకోపకారధురీణుఁడై నెగడుఁగావుతమని కోరుచున్నవాఁడ. భగవంతుఁడగు సిద్ధేశ్వరుఁడు సర్వసిద్ధులనొసంగి యిట్టికృతులనేకముల నిక్కవిచే రచియింప నాయురారోగ్యంబులనిచ్చుఁగాక.

పండితవశంవదుఁడగు హితాభిలాషి

కడప.
15.7-30

జ. వే. సుబ్రహ్మణ్యశర్మ.

# ఉపోద్ఘాతము



ఈసిద్ధేశ్వరశతకము ఆధ్యాత్మిక విద్యారహస్యముల వెల్లడించునొక చిఱుపొత్తము. గ్రంథకర్త తొలుతటినుండియు వేదాంతతత్త్వమెఱింగి సుజనులసేవించి తత్త్వమర్మము లుపదేశింపఁబడినవాఁడు. "బ్రహ్మసత్యం జగన్మిథ్య" యను సూత్రమిందు విపులముగఁ జర్చింపబడినది. జీవబ్రహ్మాభేద ప్రతిపాదనము సహేతుకముగఁ బొందింపఁబడినది. ఒక్కయెడ నష్టవిధప్రమాణములు ప్రమాణసహితముగ, విచక్షణతతో, విపులముగ వ్రాయఁబడియున్నవి. అపరిచితులగువారికిఁ గేవలము గహనమువలెఁ గన్పట్టు వేదాంతవిషయములను సులభశైలి నాంధ్రములోఁ బద్యరూపమున వెలయించుట యీకవి ముఖ్యోద్దేశము. ఇందీతఁడు కృతకృత్యుఁడయ్యెనని మాయాశయము. అన్నిపద్యములకును మకుటమొకేరీతిని దనరారుచున్నది. ఇట్టి సద్గ్రంథముల నాదరించి చదువుటవలనఁ బురుషార్థములలోఁ బూర్వాభిగణ్యమగు మోక్షలక్ష్మీసామ్రాజ్యము సులభముగఁ గరగతమగుననుటకు సందియముండదు. పద్యకవితయందలి విజ్ఞానము వెలయఁగవి యనేకస్థలముల మంచిమంచి యుపమానములనుఁ బ్రయోగించి యర్థమును బెంపొందించెను.

ఈసుకవి వ్రాతప్రతిగానుండుతటి నీపాత్రమును నాకుఁ దెచ్చి వినిపించెను. వ్యాకరణ సంబంధములను నేవోకొన్ని మార్పులమాత్రము చేసితిని. తక్కినవిషయములలోఁ గవిత యంతయు మంచిస్థితిలోనున్నది. తరుణవయస్కుఁడును, వేదాంతవిద్యోపాసకుఁడునగు నీచిన్నవాఁడింక నిట్టికృతులు వ్రాసి భాషాసేవనొనరించి కీర్తివడయుఁగాతమని కోరుచు నింతటితో నుపరమించుచున్నాఁడను.

ఇట్లు,

శతావధాని పంచానన &

**కవిసింహ. డి. రాజశేఖరశతావధాని.**



శ్రీ

——◆ ఈశ్వరస్తుతి. ◆——

శా॥ శ్రీమద్భక్తజనామరద్రుమము గౌరీ-ప్రాణనాథుండు ను
త్రామాద్యష్టదిగీశవందితుఁడు స-ర్వజ్ఞుండులోకైకర
క్షామాణిక్యము చంద్రశేఖరుఁడు మో-క్షప్రాజ్యసామ్రా
జ్యసు
శ్రీమంతుండు దయాసముద్రుఁడయి ర-క్షించుఁ బ్రజాకో
టులన్॥

——◆ గురుపరంపరాస్తుతి ◆——

సీ॥ నారాయణుండును-నలువయునువసిష్ఠ
సంయమీంద్రుండును-శక్తిమునియు
పరమపరాశర-వ్యాసులుశుకుఁడును
గౌడపాదుఁడుగుణ-గౌరవుండు
గోవింద యోగీంద్ర-గురుఁడునుశంకర
పద్మపాదాది విద్వ-త్ప్రముఖులు
హస్తామలకతోట-కాచార్యవర్యుల
భాష్యాధికారసం-పన్నమతుల
తే॥ గీ॥ బ్రహ్మవిద్యాధురీణుల-భవ్యమతుల
వేదమూర్తులగురులహృ-ద్వీధియందు
భక్తితాత్పర్యములతోడఁ-బ్రస్తుతింతు
అవిరళాత్మానుభవమిచ్చి-యాదరింప॥

——◆ గురుస్తుతి ◆——

ఉ॥ ఆయతదోసకాయలమవాఁన్వయశీతకరుండు దుర్గమా

మ్నాయరహస్యవేదిసుజనవ్రజపూజ్యుఁడుమద్గురుండునా
రాయణుధీశుభవ్యచరణాంబురుహద్వయమున్ నిరంతరా
మేయమనోజ్ఞభక్తిరతిమిక్కిలిఁబ్రస్తుతిఁజేతునెమ్మదిన్ ।

మ॥ కరుణాదృష్టినినన్నుబాల్యమునఁబ్రక్కన్ జేర్చివేదాంతత
త్త్వరహస్యంబులసర్వమున్ దెలిపిపుత్రప్రేమమన్నించుమ
ద్గురునిన్ భాగవతాగ్రగణ్యుబుధవంద్యున్ గోవిదున్ సద్గుణో
త్కరునారాయణనాముతండ్రికరణిన్ ధ్యానింపఁగాఁజెల్లదే॥

ఉ॥ వ్యాకరణంబుసూత్రములపద్ధతిఛందములో మెఱుంగుభా
షాకృతులన్ రహస్యమువిశాలరసాగసభేదమర్మముల్
నాకెరిగించినట్టిసుజనప్రభునిన్ గవిసింహనాము దు
ర్భాకకులాబ్ధిచంద్రమునిఁ బ్రస్తుతిఁజేసెదరాజశేఖరున్ ।

సీ॥ దక్షిణానిలముమం-దముగవీచుచునుండ
నొకనాఁడు మేముగూ-ర్చుండియుండ
నరునితో చేరిన-నారాయణునిబోలె
నారాయణగురుడుఁ-నన్నుజేరి
త్రయ్యంతవిద్యావి-ధానభేదంబుల
బోధించుచొకకొంత-ప్రొద్దుబోవ
అధ్యాత్మవిద్యామ-హత్వంబుదెలియంగ
సిద్ధేశశతకంబు-చేయవలయు

తే॥ గీ॥ ననుచుకోరికగల దైన-వ్యవధిచాల
దనిననీకూర్మినీచర-ణాంబుజముల
దలఁచినేవ్రాయఁదొరకొందు దయవహింపు

మనుచుఁ బ్రార్థించితిని మంచి - దని యెనతఁడు

తే॥ గీ॥ నగరిబలిజకులంబున - నయముతోడ

జననమొందియు సుజ్ఞాన - ఘనులకృపను

శుద్ధచైతన్యమేకమౌ - సిద్ధమూర్తి

కల్పితంబుగ శతకంబు - నల్లినాఁడ॥

సీ॥ పెదకంటికులవార్ధి - విధుబింబమగుచు సా

నేవల్లైవంశమ్ము - నెగడఁజేయు

మైసూరురెడ్డిర - మామూర్తి నాగనూం

బలపూర్వపుణ్యత - పఃఫలంబు

గాఁగ సూరారెడ్డి - గణనీయకీర్తియై

యొజ్జుగుంట్లపురాన - నెసఁగుచుండు

అతఁడు ప్రజాసేవ - నాత్మవృత్తిగ బూని

యర్థార్థిసంఘంబు - నాదరించు

తే॥ గీ॥ ఇతఁడె నేఁ రచించు సి - ద్ధేశశతక

మచ్చువేయించె నిపుడు దే - వాదిదేవు

డాయురారోగ్యభోగభాగ్యముల నిచ్చి

పరమకృపతోడ నతనిఁ గా - పాడుఁగాత॥





# శ్రీ ఆత్మబోధసిద్ధేశ్వరశతకము.

సీ॥ శ్రీకరంబమలర-త్నాకరం బానంద
శేఖరంబతుల సు-శ్రీయుమగుచు
అద్వితీయాత్మకం-బాద్యంతవిద్యయా
వేదాంతసారసం-వేద్యమగుచు
ధీసాక్షివిదితమై-ధ్యేయస్వరూపమై
సచ్చిదానంద వి-చారమగుచు
అందమై శ్రుతిలతా-కందమై యలరారు
పరతత్వరూపమై-బ్రహ్మమగుచు

తే॥ గీ॥ బుధజనవ్రాతసంప్రాప్తబోధమగుచు
సంగరహితులవిశదలాంత-రంగమందు
భూరియశమునవిలసిల్లు-భుజగభూష
భవ్యసిద్ధేశకలమల్లె-భవవినాశ॥ 2

సీ॥ లయకారిరుద్రుండు-లయముజేయుచునుండు
ననవరతంబుదా-న నెడివార్త

ర్వబ్రహ్మాండంబు - సాక్షిమాత్రునియందు
లీనమైయుండుట-గాన లేదె
అజ్ఞానమునువీడి-విజ్ఞానరూపమై
నిజవిలాసంబున-నిలిచియుండు
రుద్రబీజంబుదా-భద్రమాచిన్ముద్ర
నిర్నిద్రముద్రమై-నిలిచియుండు
తే। గీ॥ సర్వసంసారభారనా-శంబుకతన
సర్వసంహారకత్వంబు-సరగఁదాల్చి
సర్వమంగళనికురంబ-సహితుఁడగుదు
భవ్యసిద్ధేశకలమళ్ళభవవినాశ॥ 3

సీ॥ సుఖముస్వభావమై-సొంపుమీరఁగఁగదా
శంకరాహ్వయమది-సార్థమయ్యె
ఆనందరూపమై-యలరుచుండగఁగదా
కలధౌతకుధరంబు-నెలవుగలిగె
సంగహీనోంకార-సారమౌటనెకదా
శివనామవిఖ్యాతి-సిద్ధమాయె
చిత్సుఖరూపమై-శ్రేయమొందఁగఁగదా
శంభునామంబు ప్రశస్తమయ్యె
తే। గీ॥ నిగమనిగదిత! విశ్వేశ!-నిత్యసత్య!
శ్రీమహాదేవ! దేవేశ!-శ్రీమహేశ!
ఈశనినుబ్రస్తుతింప ర-మేశువశమె

భవ్యసిద్ధేశకలమళ్ళ-భవవినాశ॥ 4

మలజ్ఞానాగ్ని-సంపద్విశేషిమై
కామునసంగుగా-గాల్చినావు
చిద్విలాసోల్లాస-చిన్మయమూర్తివై
త్రిపురరాక్షసులవ-ధించినావు
అసహ్యశమైనజ్ఞా-నానందమూర్తివై
విషముఁగుత్తుకఁదాల్చి-వెలసినావు
రౌద్రమేపారగా-రుద్రుఁడవైదక్షు
నధ్వరాజ్ఞానంబు-నడఁచినావు
తే॥ గీ॥ ఎఱుఁగలేరునీమహిమలు-హరియుబ్రహ్మ
చిరశుభాకారమంగళ-చిత్స్వరూప
అద్వితీయాత్మబ్రహ్మమై-యలరుమూర్తి
భవ్యసిద్ధేశకలమళ్ళభవవినాశ॥ 5

సీ॥ పురుషహాకారంబు-భూరిమయంబైన
శక్తిసకారంబు-సరవితోడ
సగుణనిర్గుణముల-సారభూతంబన
చిద్బిందురూపంబు-చేరనడుమ
హంసమైపరగిదే-హాంశమేచాయత
ప్తామసుస్సుకరణిసం-వ్యాప్తమగుచు
దేహతాదాత్మ్యంబు-దృఢముగాదోఁచిదే

హప్రాణములుస్థిర-మనుటవలన

తే। గీ। జీవుఁడజ్ఞానబద్ధుఁడై - చెడునుదుఃఖ
మస్థిరత జడత్వమునొంది - యురుగుచుండు
జననమరణాది దురితసం - సక్తుఁడగుచు
భవ్యసిద్ధేశకలమల్ల - భవవినాశ। 6

సీ। శుద్ధజీవుఁడు దేహ - బద్ధతజడుఁడగు
జడ దేహిజ్ఞానా ప్తి - జడతబాయు
విద్యయుభ్రాంతిన - విద్యయై పెంపొంది
బుద్ధినడంచియు - భూరిమహిమ
ఆవరణంబుచే - నఖిలంబుగప్పియు
విక్షేపశక్తిచే-విశదమగుచు
నానావిధంబుల - నామరూపములొంది
దృశ్యరూపంబున- దెలుపుచుండు

తే। గీ। ఇట్టిమాయయె విజ్ఞాన-దృష్టిచేత
జెడినకార్యంబువెంటనే - చెడునుగాన
బ్రహ్మమొక్కఁడెదృక్కుగా-ప్రభవహించు
భవ్యసిద్ధేశకలమల్లభవవినాశ।

సీ। హేమమొక్కటిచాల-హితభూషణంబులై
కార్యరూపంబున - గానబడదె
పాషాణమొక్కటి-బహురత్నమయదీప్తి

ప్రభవహించియుమించి-ప్రబల లేదె
వృష్వస్తువొక్కటి-మేదినిఘటము లై
నామరూపములొంద-నన్ను లేదె
సదమలబ్రహ్మంబు-సన్మాత్రమైయుండి
సకలభూతంబుల-సంగమగుట
తే॥ గీ॥ అదియు కారణబ్రహ్మ మం-దరయ జగము
లమితముగ దోఁచి బ్రహ్మాండ-మాదిగాగ
లయము చెందుఁజిన్నదియె-లంగుచుండు
భవ్యసిద్ధేశకలమల్ల-భవవినాశ॥ 7

సీ॥ కంటిచే రూపంబు-గాంచెదనన్నను
కంటికదృశ్యమై-కనును మనసు
మనసుచే సర్వంబు-నెనయుదునన్నను
బుద్ధికిదృశ్యమై-బద్ధమయ్యె
బుద్ధియే దృక్కునై-బోధమయ్యెనటన్న
ధీవృత్తి సాక్షికి-దృశ్యమయ్యె
సాక్షి కేదియు దృక్కు-వీక్షింపగా లేదు
దృశ్యసృష్టికి సాక్షి-దృక్కు నయ్యె
తే॥ గీ॥ దృక్కు బ్రహ్మంబు మాయయు-దృశ్యమాయె
మాయ చేతనసంయోగ-మహితశక్తి
రూపమిరవొంద జగముల-దోఁపఁజేసె
భవ్యసిద్ధేశకలమల్ల-భవవినాశ॥ 8

సీ॥ మాయతో బ్రహ్మంబు-మరిగూడెనన్నను

మాయలేనిదియయ్యు-పాయుచుండు
లేసిమాయనదెల్లు-లీలావినోదియై
జగములగల్పించి-సద్విలాస
మాయయను జవనిక-మధ్యమందుననిల్చి
నర్తకుండనఁదగి-నటనసల్పు
అమరతిర్యఙ్నర-కమనీయవగమూర్తి
సదమలహృదయాంబు-జాతవర్తి
తే। గీ॥ సమతజైతన్యరూపమా-సత్యమూర్తి
సర్వభూతస్థసంపూర్ణ-చక్రవర్తి
సచ్చిదానందమయమూర్తి-సాంద్రకీర్తి
భవ్యసిద్ధేశకలమల్ల-భవవినాశ॥ ౯

సీ॥ బ్రహ్మచైతన్యంబు-ప్రకృతితోఁ గూడియు
సాక్షిగాప్రతిబింబ-రూపుడగుచు
ఈశ్వరత్వముబొంది-విశ్వంబుసృజియించి
భోగభాగ్యములెల్ల-బొందుపఱచె
నావిద్యమలినంబు-నామాయనేగూడి
దేవత్వమునుబాసి-జీవుఁడయ్యె
జీవుడవిద్యచే-చేయుకార్యంబెల్ల
సుఖదుఃఖమయములై-సూటిఁదనరె
తే। గీ॥ నహహా చిత్రంబునీమాయ-నరయఁదరమె
బ్రహ్మసత్యంబుజగమిది-భ్రమయునసియు
జీవదేవసనాతన-సిద్ధిగనదు
భవ్యసిద్ధేశకలమల్ల-భవవినాశ॥ 10

సీ॥ మాయ యాత్మకళాన – మాయుక్తిశివజీవ
రూపంబుతో నామ – రూపకమగు
వివిధజగములఁగ – ల్పించెనందురుగొంద
రూహింపఁగా మాయ – యుత్తవగుట
సంధ్యాసుతునిమాటఁ – వర్ధిల్లుజగమెల్ల
లేనిమాయనుగూడి – లేకదోఁచె
ఆత్మబుద్ధియనుచు – నభిమానమునబుద్ధి
యైపర్వి జగములఁ – దోఁపఁజేసె
తే॥ గీ॥ బుద్ధినిర్మలమైనను – పూర్ణభంగి
శివవిభూతినిబొందుచు – శ్రేయమొందు
మలినజీవుఁడు బహుళజ – న్మములనొందు
భవ్యసిద్ధేశకలమల్ల – భవవినాశ! 11

కం॥ శివజీవసృష్టుల – జేరిజగంబులు
వ్యష్టిసమష్టుల - వ్యాప్తమగుచు
ఘటమఠంబులనెల్ల - గగనంబుపరికింప
నామహాకాశమే – యైనవిధము
వ్యష్టిసమష్టుల – వైఖరిసమమున
బ్రహ్మమాత్రంబునై - ప్రతిఫలించి
మాయయవిద్యయఁ – మహిమచేఁదనరంగ
బుద్ధితత్వంబునై – పుణ్యపాప
తే॥ గీ॥ కార్యకారణరూపముల్ – గలుగజేయు
నాయుపాధియుఁదొలఁగిన – యంశమాత్ర

నిత్యనిర్గుణబ్రహ్మమే - నిలిచియుండు
భవ్యసిద్ధేశకలమల్ల - భవవినాశ॥

సీ॥ బుద్ధినెఱుంగక - పోవదీజగమెల్ల
బుద్ధికల్పితమగు - భూరిజగము
ఘననామరూపముల్ - క్రమమునదాల్చియు
సత్యమైపిసప న - సత్యమగును
బుద్ధిసాధన లేక - బోధస్వరూపంబ
దట్టిదిట్టిదియని - యనఁగదగునె
తానుతానై యున్న - తత్వంబుదెలియఁగ
నాబుద్ధినశియించి - యాత్మనిలుచు

తే॥ గీ॥ బుద్ధిసర్వేంద్రియవ్యాప్తిబద్ధమగుట
జగములెల్లను గలిగియుఁ - జాలఁదోఁచి
సమయుధీవృత్తిసాక్షియే - చాలవెలుఁగు
భవ్యసిద్ధేశకలమల్ల - భవవినాశ॥

సీ॥ నీనిరామయశక్తి - నిలిచియుండుటఁజేసి
చంద్రార్కులుప్రకాశమందుచుండ్రు
నీమహావైదుషి - నెగడియుండఁగగదా
నిఖిలచరాచర-నిచయమాయె
నీసత్కళాస్ఫూర్తి - నిబిడమైబ్రహ్మాండ
పిండాండమెలమియై - పెంపుగనియె
నీవు లేకుండిన - నిఖిలంబుమఱిలేదు
నీవెసర్వంబునై - నెగడుచుండు

తే॥ గీ॥ నీవొకండవెయుండుట - నిజముసుమ్ము
నీవుసూత్రాత్మవై యుండ - నెగడునన్ని
అన్నిసమసియుసాక్షివై - యలరెదీవు
భవ్యసిద్ధేశకలమళ్ళ - భవవినాశ॥ 14

సీ॥ ఛాయయహంకార - సంయుతంబయియొప్పి
తనువుతాదాత్మ్యంబు - దానుబొందు
జీవుఁడీతాదాత్మ్య - భావమ్ము విడలేక
తానెతనువటంచు - తలఁపుగలిగి
కర్మవాసనలచే - గట్టువడుచునుండు
కర్మలేయజ్ఞాన - గాఢగూర్పు
దానుబ్రహ్మంబంచు - దన్నెఱింగినయంత
విజ్ఞానమయుఁడగు - విపులకర్మ
తే॥ గీ॥ మెసిలిపోవునునడినహం-కృతియుజెడును
దనువునేననుభ్రమపోవు - మనసువీడు
బ్రహ్మమాత్రమెసత్యమై - ప్రకటమగును
భవ్యసిద్ధేశకలమళ్ళ - భవవినాశ॥ 15

సీ॥ అతులితాహంకార - యుతుడయిజీవుండు
సహజతాదాత్మ్యసం-సర్గజేసి
యెఱుకలేకయెయుండునిట్టి-తాదాత్మ్యంబు
ప్రారబ్ధమెడలిన-పాఱిచనును
భ్రాంతితాదాత్మ్యంబు-బ్రహ్మంబుబొందొప్పి
తత్వంబుసాక్షిచే-దలగిపోవు

కర్మతాదాత్మ్యంబు-కాయంబునంబొంది
సుప్తిచేలయమొందు-సుమ్ము తుదకు
తే॥ గీ॥ అన్నితాదాత్మ్యములనుండు నహముపీడి
తనువుతానను తొలుతటి-తలఁపువీడి
బోధమాత్రమునిలుచును-బూర్ణరీతి
భవ్యసిద్ధేశకలమళ్ళ - భవవినాశ॥ 16

సీ॥ మనసునహంకార-మయమునై జడమయ్యు
సుప్తినిలయమొంది-సుఖముగాంచు
నహమెయంకురమయ్యు-నటఁగానఁబడెనేని
స్వప్నమైకస్పష్టి-సగము వెలుగు
యంతఃకరణమెదా-నంతయువెలుఁగొంద
జాగ్రద్విధంబొంది-చాలవెలుఁగు
జాగ్రత్సుషుప్తులు-స్వప్నమట్ మూడవ
స్థలకునుమూలమై - సాక్షియగుచు
తే॥ గీ॥ యేదిప్రభవింపఁజేయుచు - నెలుఁగుచుండు
నట్టిబ్రహ్మముదానని-గట్టిగాను
జీవుడెఱిఁగిననాడె తా- దేవుఁడగును
భవ్యసిద్ధేశకలమళ్ళ-భవవినాశ॥ 17

సీ॥ స్వప్నసంకలితుఁడా-స్వప్నప్రపంచంబు
సత్యంబుగాఁజూచు-సరసలీల
వ్యావహారికుఁడుదా - వ్యావహారికలోక
మదిసత్యమనినమ్ము - నైనస్వప్న

జగమునుమిథ్యగాఁ-గనఁగనెఱుంగునుపార
మార్థికజీవుఁ డు–దారుఁడగుచు
వ్యావహారికజీవ-వర్తనమంతయు:
వట్టిదిగానెంచి–బంధముడిగి
తే॥ గీ॥ బ్రహ్మచైతన్యరూపంబు-వడసి నామ
రూపయుత-లోకమిథ్యని-రూఢిఁదలఁచి
సంసృతివికారములువీడి-సౌఖ్యమొందు
భవ్యసిద్ధేశకలమళ్ళ-భవవినాశ॥ 1

సీ॥ సముదారవేగదా–ర్ఢ్యములుగల్గిచరించు
వ్యాళరాజముభూరు–హంబునెక్కు
పగిదినహంకార–భావంబు తనువను
కపినుహోన్నతపువృక్షంబునెక్కి
మూఁడవస్థలవెంట–మునుకొనిజీవుఁడై
పుట్టుచుఁబెఱుగుచు–గిట్టుచుండు
స్వప్నమందునబుట్టు జాగ్రత్ స్థితిఁబెరుగు
సుప్తిలోలయమయ్యు -జూచుచుండు
తే॥ గీ॥ నట్టియాసాక్షిపుట్టదు-గిట్టదెపుడు
జ్ఞానమైయుండువిజ్ఞాన-ఘనతగాంచి
సంతతంబునుసుఖమునై-శాంతితోడ
భవ్యసిద్ధేశకలమళ్ల-భవవినాశ।

సీ॥ సాక్షియవస్థల–సమయ కజ్ఞానియై
పగలురాత్రులయందు–ప్రబలి వెలుఁగు
దినదినంబునువెల్గు–ఘనముగానదియును

వారంబుమాసంబు - వత్సరంబు
యుగకల్పములవెల్గు - యుగములునముయంగ
భాసురప్రభతోడ - బ్రత్యగాత్మ
ఏకమైసత్యమై - జోకతోగుప్తమై
యంతమైశ్రుతిపద్మ - కందమగుచు
తే। గీ। నందముగవెల్గునవ్యయా - నందమగుచు
విశదమైవెల్గునావెల్గె - విమలముగను
నిత్యనిర్మలబ్రహ్మమై - నెగడివెలుఁగు
భవ్యసిద్ధేశకలమల్ల - భవవినాశ। 20

సీ। బ్రహ్మమందునమాయ - బహునఖండతనంటి
నావృత్తివిక్షేప - మయ్యెనదియు
జగమునుజీవుని - దగసృజించియువేగ
నావరణంబున - నప్పిగప్పి
బ్రహ్మసర్గంబుల - భ్రాంతితోదెలియక
బ్రహ్మయువికృతిదా - బద్ధయట్లు
నిలిచియూరకయేమి - నేరగరాకుండు
నావృతినశియించి - నపుడెదోచు
తే। గీ। బ్రహ్మసర్గంబులకుభేద - భావముండు
సృష్టిదానివికారంబు - స్వీకరించు
బ్రహ్మప్రభవించివెల్గొందు - బ్రకటముగను
భవ్యసిద్ధేశకలమల్ల - భవవినాశ। 21

సీ॥ విక్షేపశక్తి ప్ర-త్యక్షమై కన్పట్టి
లింగమాదింజగ-త్సంగమెల్ల
శరధిలో సుడువులు-విరివిగా నగపడి
యటగొంత సేపటి-కడగునట్లు
సచ్చిదానందంబు-సరవితో బ్రహ్మమం
దరయఁగ స్థిరముగా-పరగినట్లు
సుచి ఘను దేసయు-సూఢిగాఁగ డుఁజల్ల
దనము నుసీరము-దాల్చినట్లు
తే॥ గీ॥ లోన దృగ్దృశ్య భేదముల్-నాశిపించి
బయట బ్రహ్మము బ్రహ్మాండ-భావముఁ బాపి
సచ్చిదానందమూర్తియై-చాల వెలుఁగు
భవ్యసిద్ధేశ కలనుల్ల-భవవినాశ॥ 22

సీ॥ ఆత్మసంభూతమై-యవ్యక్తమగుచుండు
అలమాయ బ్రహ్మము-నందు నిలిచి
ప్రకృతిస్వరూపమై-పరగ జీవునిఁబట్టి
యజ్ఞానవిదితమై-యుక్తి నిలచి
ఈశ్వర తేజంబు-నిశ్వంబుగాఁ జూపి
భావరూపంబున-బరగుచుండు
పరమర హాస్యంబు-పరతత్త్వరూపంబు
గుసగుసమా భక్తిచే-గుఱుతుఁగన్న
తే॥ గీ॥ ప్రకృతి లేనిది లేకయే-వ యుచుండు
వికృతిదా గాక నేరాదు-విశదముగను

సాక్షిమాత్రమైనిలుచును-సర్వమూర్తి
భవ్యసిద్ధేశకలమళ్ళ-భవవినాశ 23

సీ॥ జ్ఞానసుధాకరుల్ - పౌర్ణిమ మావాస్య
యందునగూడియు-నట్లెగడక
తెలివితోనీడయై-గలసినమనసుదా
శబ్దాదివిషయసం-చారమునను
కార్యంబువెలువల-ఘనముగాదోపించు
కార్యకారణబ్రహ్మ.సూర్యుడరయ
మఱియమావాస్యయే-మాయయైనీడయౌ
చంద్రుండుమనసన-జతగనొప్పు
తే॥ గీ॥ బ్రహ్మశశినమావాస్యలు-సాయుకరణి
చూపఱియుజూడబడునది-చూపులేక
త్రిపుటిరహితమఖండమై-తేజరిల్లు
భవ్యసిద్ధేశకలమళ్ళ-భవవినాశ॥ 24

సీ॥ భానుండుదీప్తుల-బర్వంగజేయుచు
నుదయాద్రిదోతెంచి-కదలినడువ
తిమిరజాలంబెల్ల-తీరుదత్ప్రభతోడ
బ్రహ్మాండపిండాండ-భాండమొప్పు
మఱియుబోధారుణ-కరణంబుమండితా
ఖండమండలదీప్తి-నిండివెల్గు
సర్వకర్మములకు-సాక్షియైసర్వప్రభా
నందమైబహుళగా-ఢాంధకార

తే॥ గీ॥ ముడివిడి స్ఫూర్తినిగురియుచు-పూర్ణరీతి
జ్ఞానదీపంబునీవయై-ఘనత వెలుఁగు
కర్మసాక్షికిసాక్షివౌ-ఘనుఁడవౌర
భవ్యసిద్ధేశకలమళ్ళ-భవవినాశ 25

సీ॥ గాఢాంధకారంబు-గప్పుట నేమియు
గాన కమావాస్య-గ్రమ్ముకొనిన
చక్షువులుండియు-లక్షింపనేరని
కరణిమైనీమాయ-గప్పినపుడు
ఆవరణంబుచే-నటగానరాకయు
విక్షేపమునగాని-వివరమెఱుఁగఁ
జాలకగర్వాంధ-జడమతుల్ భవమున
మునుగుచు దేలుచు-మోసపోయి
తే॥ గీ॥ తనువుదాననునజ్ఞాన-తమముచేత
తిరుగుచుండఁగ గురుమూర్తి-పరమవిద్య
ఘనతఁ దెలుపఁగ ముక్తిని-గాంచనగును
భవ్యసిద్ధేశకలమళ్ళ-భవవినాశ॥ 26

సీ॥ ఆవరణంబుచే-నమనసయనదగి
విక్షేపశక్తిచే-విశదమగుచు
శుద్ధపక్షంబను-సుజ్ఞానవృద్ధితో
సాక్షిసంధానంబు-చక్కఁజేరి
పూర్ణిమాచంద్రుండు-పూర్ణమాకాంతితో
మనసుతో నేకమై-ఘనతనిలుప

నెఱుకయు మఱుపును - నేకంబు జేయుచు
దెల్వితో నెలయంగ - దేజమగుచు
తే॥ గీ॥ మండితాఖండచిచ్చంద్ర - మండలంబు
పండువెన్నెల లలరంగ - నిండివెల్గ
నటులదహరాంతరాకాశ పటలి వెలుఁగు
భవ్యసిద్ధేశ కలముళ్ళ - భవవినాశ॥ 27

సీ॥ బ్రహ్మచైతన్యంబు - ప్రకృతినిగూడుచో
దానె ప్రపంచమై - దనరుచుండు
నావిసర్గమె బ్రహ్మ - నటు జేసినదియును
భూరివిజ్ఞానమై - పూజ్యమగును
నామరూపములెల్ల - నేమించిసత్యంబు
మానుగా జేయుచు - మాయయుండు
స్థిరతత్త్వశోధన - చేయుగా జ్ఞానంబు
చైతన్యరూపమౌ - సమయము మాయ
తే॥ గీ॥ స్థూలసూక్ష్మకారణతనుల్ - దొడరి పైన
నాయవిద్యదాననుచును - నరుగుచుండి
త్వంపదార్థముశోధింప - దానెసాక్షి
భవ్యసిద్ధేశకలముళ్ళ - భవవినాశ॥ 28

సీ॥ తత్త్వరహస్యన - త్యంబెఱుంగమిమాయ
ఆవరణంబునై - యడ్డుపడును
తత్త్వవిచారణ - తలపుచేతనుపాప
మూడియావరణంబు - వీడిచనును

విక్షేపశక్తియు-విషయసుఖంబుల
దవులుగూర్చుచు హెచ్చి-దనరుచుండు
ప్రారబ్ధమునశింపఁ - బాయువిక్షేపము
కైవల్యసుఖ్యాల-గలుగఁగలదు
తే। గీ॥ ప్రకృతి, మాయ, యవిద్య, యా-వరణములును
బాసి విక్షేపముతొలంగి-పరమశుద్ధ
భావముంగన్న జీవుఁడు-బ్రహ్మమగును
భవ్యసిద్ధేశకలముల్లో-భవవినాశ॥ 29

సీ॥ శబ్దంబుస్పర్శంబు-సరవిరూపరసగం
ధములనువరుసశో-త్రంబుత్వక్కు
చక్షువుజిహ్వనా-సయునుగ్రహించిత
ద్గుణములుగలవస్తు-కోటి నెఱుఁగు
అవివదింటి నెఱింగి-యంతఃకరణ మొప్పు
జీవుఁడమ్మూటిని-జీవసాక్షి
చైతన్యరూపమై-శబ్దాదిదశకమం
తఃకరణముజీవుఁ - డా నెఱుంగు
తే। గీ॥ దానిదెలియ వేరొక తెల్వి - దాటిచనదు
ఇంద్రియాగోచరముగాన - నిమ్ము గాను
అదియొకన నన్నిపోయిబ్ర - హ్మం బెనిలుచు
భవ్యసిద్ధేశకలముల్ల - భవవినాశ॥ 30

సీ॥ జ్ఞానియజ్ఞానియు - సలుపు కార్యము లేక
పరణినుండుసుఖేక-మరయరాదు

నీరజదళముపై-నీటిబిందువుమాటి
ప్రాపంచికవిషయ-పటలియందు
తనమనోవృత్తులు-దవులుచెందగనీక
జ్ఞానియునాత్మవ-శంబుచేయు
నిజమనఃకల్పిత-నిఖిలవృత్తులఁజొచ్చి
యడుసునజిక్కిన-హాస్తికరణి
తే॥ గీ॥ వ్యసనములఁజిక్కి-విజ్ఞాన-భరముతక్కి
జననమరణంబులందున-జ్ఞానిమునుఁగు
భవమునెడబాసిజ్ఞానియు-వడయుముక్తి
భవ్యసిద్ధేశకలమళ్ల-భవవినాశ॥ 31

సీ॥ రవిబింబరశ్మిఁబూ-ర్ణసముద్రతోయంబు
లావిరిగామారి-యాకసమున
బ్రాకిధారాధర-పటలమైయవ్వల
చలువగాడుపులుపై-నొలసినపుడు
నంతయుగఱగుచు-నంబుకణంబులై
వర్షరూపముదాల్చి-వసుధఁగురిసి
కాల్వలైవంకలై-కడకుమహానదు
లై సముద్రముచేరు-నావిధమున
తే॥ గీ॥ బ్రహ్మచేమాయనామరూ-పములుపొంది
స్థూలమైనిల్చిజ్ఞానవి-స్ఫురణచేత
నంతయునడంగిబ్రహ్మమే-యవలవెలుఁగు
భవ్యసిద్ధేశకలమళ్ల-భవవినాశ॥ 32

సీ॥ విషయభోగంబుల - వేనవేల్ పొందుచు
లాభనష్టంబుల - లక్షణముల
అభిమానవంతుడ - హంకారినృత్యాభి
మానుడై ప్రభువగు - మాడ్కి మరియు
శబ్దాదివిషయంబు - సామిగ్రావ్యమునసంట
సభ్యసంఘమునగ - సంభ్రమమున
నానావిధవికార - నాట్యవనిశబుద్ధి
అనుకూలసంచారు - లగుచుశ్రోత్ర
తే॥ గీ॥ మాదిగానింద్రియచయంబు - లపుడుతాళ
నాట్యసాధనధనులుగా - నాట్యరంగ
దీపమునగసుసాక్షియే - దీప్తినించు
భవ్యసిద్ధేశకలమళ్ల - భవవినాశ॥ 33

సీ॥ చైతన్యవిస్ఫూర్తి - సతతంబుబహురూప
నామమాత్రంబుల - నానామగుచు
సకలచరాచర - జంగమస్థావర
దేవమానవకోట్లు - దేశకాల
వస్తుచయంబులు - వసుధచిత్రంబుగా
మాయావిచేష్టలి - మ్మాన్టిక్కదోచి
సమయుచునుండును - సగుణంబులెల్లను
నిర్గుణబ్రహ్మంబు - నెలవుజేసి
తే॥ గీ॥ పుట్టుచుండును బెరుగును - గిట్టుచుండు
పుట్టువునుగూర్చిలోపలి - గుట్టుతెలియ

పుట్టుపెన్నడు లేదను-బోధవిగులు
భవ్యసిద్ధేశకలమళ్ళ - భవవినాశ॥ 31

సీ॥ ఒకయక్షరంబగు-నోంకారమనునది
నిర్గుణసగుణత్రి-వర్గమగుచు
అ, ఉ, మకారంబులు - ననయంబుగూడియు
బ్రహ్మవిష్ణుమహేశ - భావమగుచు
సంతతాఖండమై-సచ్చిదానందమై
చిత్ప్రభాబోధమై-స్థిరములగుచు
మునిజనామోదమై - ముక్తినిధానమై
సత్త్వస్వరూపంబు-సరసనొల్పు
తే॥ గీ॥ యలరుచుండును బ్రహ్మాండ-మావరించి
ప్రణవరూపమునిత్యంబు - ప్రణుతిగాంచు
చిన్మయానందమున్ శివ- శేషకలన
భవ్యసిద్ధేశకలమళ్ళ-భవవినాశ॥ 32

సీ॥ ఈత్రిమూర్త్యాత్మకం-బేకాక్షరముప్రణ
వమునశబ్దబ్రహ్మ-ప్రభవమొంది
వేదశాస్త్రంబుల-వివరించిపరమార్థ
జీవధర్మంబుల-భావములరు
సరసబ్రహ్మైక్యాను-సంధానమార్గమౌ
నక్షరాక్షరభావ-మైనతత్త్వ
లక్షణజ్ఞానంబు-విస్తరింపజేసెను
బ్రహ్మబోధముబలు-పలుచునట్టి

తే॥ గీ॥ యామహావాక్యమహరంగ - నాదిగాను
అక్షరవిలాసమక్షర-లక్ష్యమెఱుఁగ
నిజవిలాసంబెయేకమై-నిండివెలుగు
భవ్యసిద్ధేశకలము-భవవినాశ॥ 36

సీ॥ బ్రహ్మమోంకారంబు-పరమంబునిర్గుణం
బసదృశమవ్యక్త-మైవెలుంగు
రజ్జుసర్పభ్రాంతి-రంగుగామాయచే
గలిగియుండెనట్టి-కారణమున
స్థూలంబుసూక్ష్మంబు-సుప్తియుస్వప్నజా
గ్రదవస్థలనుజీవు-డదికియుండు
స్వప్నసుషుప్తుల-జాగ్రదవస్థలో
జాలప్రకాశింప-జాలునెద్ది
తే॥ గీ॥ యదియెనేనని-జీవుండుపదిలముగను
దెలియునందాకవేదంబు-తెరవుజూపు
దెలిసిజీవుండెబ్రహ్మమై-తేజరిల్లు
భవ్యసిద్ధేశకలమఖ్య-భవవినాశ॥ 37

సీ॥ బ్రహ్మంబెయోంకార-భావంబునవెలుంగు
ప్రణవంబుశబ్దమై-పరిణమించు
ఆత్మసంభూతమై-యాకాశతత్త్వంబు
బంధురశబ్దగుం-భనలదనరు
నాకాశమందున-నావాయువగ్నియు
జలమునుపృథివియు-సరవిబుట్టె

స్పర్శరూపరసములు - సమధికగంధంబు
పంచతన్మాత్రప్రపంచకంబు
తే॥ గీ॥ ఇంద్రియాదులగూడియు - నెసగుజగము
ఏతదభిమానిజీవుఁడౌ - నిన్నువదలి
కర్మక్షయమైనచో నాత్మ - గావెలుంగు
భవ్యసిద్ధేశకలమళ్ళ - భవవినాశ॥ 38

సీ॥ దేహంబుగల్గుట - దేహియుండుటగల్గ
దేహంబులేకున్న - దేహినెట్లు
తెలియంగవచ్చును - దేహంబులోపల
తేజోమయంబగు - దీపమట్లు
ఘటరంధ్రములనుండి - వటుదీప్తివెలువలి
భాగంబుదీపించు - పగిదిగాగ
చిద్రసంబధ్యాత్మ - ముద్రయైసకలేంద్రి
యములమార్గమునబా - హ్యంబునెల్ల
తే॥ గీ॥ వెలుగజేయుచుజగముల - వేఱుగాక
నిండివెలుఁగుచునేకమై - నుండుతుదకు
సమయునామరూపంబులు - సాక్షిమిగులు
భవ్యసిద్ధేశకలమళ్ళ - భవవినాశ॥ 39

సీ॥ ఘటమున దేహంబు - ఘటజలమంతఃక
రణమౌనునంతఃక - రణముమలిన
మైనయవిద్యయౌ - నాఘటోదకమున
ప్రతిబింబితంబౌచు - పరగునభము

నటులజీవుండు దే-హంబునగనుపించు
నందుచేకూటస్థు-డనగబరగు
ఘటమునకును వెలి-గాగవ్యాపించిన
యానుహాకాశమట్లరు బ్రహ్మ
తే॥ గీ॥ ఘటము లేకున్న బింబితా-కాశమింక
పై మహాకాశమును భేద-నడవు దేహ
ముండకున్న జీవబ్రహ్మ-లొక్కటౌను
భవ్యసిద్ధేశకలమళ్ళ-భవవినాశ। 40

సీ॥ పరశివమూర్తియే-పురుషరూపంబున
దేహమన్ పురమున-దిరుగుచుండు
గుణకర్మములనుచే-కొనిదానలోబడి
యజ్ఞానబద్ధుడౌ-నట్టిజీవ
తతినిబోధించుటకునై-తనువునదనుదెల్పు
గురుశిష్యభావంబు-గూర్చినట్టి
వేదముల్ సర్వసం-పాదితార్థములొచు
పురుషార్థములనెల్ల-బొందువఱచు
తే॥ గీ॥ నదియుకర్మకాండమునఁగ-నలరుచుండి
ధర్మమర్థంబుగామంబు.దగనొసంగు
జ్ఞానకాండమై మోక్షంబొ-సంగుచుండు 41
భవ్యసిద్ధేశకలమళ్ల-భవవినాశ।

సీ॥ జననమెన్నడులేక-సర్వజ్ఞమూర్తియౌ
ప్రత్యగాత్మవలన-ప్రతిఫలించి

హృత్పద్మవాసియై-యే త్రైరవెలుపల
వ్యాపించిజీవాత్మ-యఁటిశయిల్లు
తానుతానైయున్న-తత్త్వంబుదెలియుట
కష్టప్రమాణప్రవాహ్యమైన
వేదాంతశాస్త్రంబు-వివిధరీతులనువి-
జ్ఞానతేజం బెగ-జల్లుచుండు
తే। గీ। పరమవిద్యనాచార్యని-కరుణవసని
బ్రహ్మరూపముదానని-భావమూని
శిష్యుడొందునుశీఘ్రం బె-సిద్ధపదవి
భవ్యసిద్ధేశకలమల్లి-భవవినాశ। 42

సీ। అష్టప్రమాణంబు-లనగప్రత్యక్షంబు
ననుమానముపమాన-మవలశబ్ద
మొకటియర్థాపత్తి-యునభావమైతిహ్య
మరయసంభవమునై-యలరుచుండు
నందులోప్రత్యక్ష-మనునదివిపరీత
మనగనుసందేహ-మనయథార్థ
మనమూడుభాగంబు-లైయొప్పనెదురుగా
నన్నిటిదెలియప్ర-త్యక్షమగును
తే। గీ। స్థాణువునుగాంచినిశ్చల-స్వాంతమునను
చోరుడనియెంచుబుద్ధివి-స్ఫురణమెపుఁడు
మానకయెవిపరీతప్ర-మాణమగును
భవ్యసిద్ధేశకలమల్లి-భవవినాశ। 44

సీ॥ స్థాణువుఁ బోడగాంచి - స్థాణువో చోరుడో
యనియనుమానించు - నట్టిబుద్ధి
సందేహమగుచుండు - స్థాణువుగాంచియు
య్యది స్థాణువని నిశ్చ - యముగ దెలియ
నాచంద మెపుడు ప్ర - త్యక్ష ప్రమాణమా
ధ్యాత్మిక గతులఁ - ట్లలరుచుండు
గురుడు శిష్యునిఁ జూచి - కొమర జ్ఞానస్వరూ
పము బ్రహ్మ మీవని - పలికినపుడు
తే॥ గీ॥ బ్రహ్మ నేగాను స్థూలరూ - పంబు గనిన
దేహమే నేనటించువ - ర్తించు శిష్య
మార్గమే విపరీతప్ర - మాణమగును
భవ్యసిద్ధేశ కలమళ్ల - భవవినాశ॥ 44

సీ॥ తనువెన్ని వెనశ - య్యను మేను చేర్చి రేల్
నిదురించినపుడు స్వ - ప్నదశనొంది
వివిధ దేశములకు - వివిధ భూముల కేగి
నటులు దుఃఖంబు సౌ - ఖ్యంబు గనిన
యటులు దోచునుగదా - యన్ని మార్పుల నొందు
నతఁడె పండవిగుకుం - గడిగినపుడు
కలలుఁ గోనెం దెందొ - మెలగినట్లే మెము
చేసినట్లుంట ప్ర - సిద్ధమవుట
తే॥ గీ॥ దేహమే నేనయండ సందుఁ దిరిగిరాగఁ
గలుగు ప్రత్యేకముగు జీవ - కళయె నేనొ

తెలుపుచు సుశిష్యుశంక - సందేహమగు ను
భవ్యసిద్ధేశకలమళ్ల - భవవినాశ॥ 45

సీ॥ ఏమెఱుంగకసుఖం - బిపాఱగానిద్ర
గొంటిపీవంచెఱుం - గుటవలనను
అలఘుతేజోమూర్తు - లగుసోమసూర్యన
క్షత్రమండలములు - చదలనున్న
మనసుతో నెఱిఁగివా - నిని వేఱు వేఱుగా
రూపింపఁగలుగునా - సూఢిగనుట
తనువేపదార్థత - త్త్వం బెఱుంగమిచేత
నీవు దేహుఁబవు - గావు గాని
తే॥ గీ॥ ఎఱుకగలుగువరబ్రహ్మ - మీవటంచు
గురుఁడుబోధింపఁగా శిష్యుఁడే - ఱుఁగఁగలుగు
నూర్గమదియుబ్రత్యక్షప్ర - మాణమగును
భవ్యసిద్ధేశకలమళ్ళ - భవవినాశ। 46

సీ॥ మఱియనుమానప్ర - మాణంబుతగుప్రతి
జ్ఞాహేతుదృష్టాంత - సంజ్ఞత్రివిధ
మగుచుందుపర్వత - మందగ్నియున్నద
నంగనయ్యదిప్రతి - జ్ఞయగుచుండు
అచలమందునధూమ - మగపడుటే హేతు
వాధూమముండిన - నగ్నియుండు
ననుటకుదృష్టాంత - మగుబాకశాల దే
హమునబ్రహ్మంబున్న - దనప్రతిజ్ఞ

తే॥ గీ॥ ఇంద్రియాదుల నెఱుఁగు టె - హేతువయ్యె
నఖిలజీవులయందుబ్ర-హ్మంబునరి
యఖిలము సదానె యటాట సృష్టాంతమయ్యె
భవ్యసిద్ధేశకలసుఖ - భవవినాశ॥ 47

సీ॥ తుల్యవస్తువుజూచి తొలిదాని దెలియుట
యుపమానమగునెన్న - లొప్పపాల
వలెనున్న శుభ్ర కాం-తులనుండు టెఱుఁగనొ
సచరాచరాత్మవి-శ్వంబునందు
స్థానభూశంబునై -సకలంబుగూడియు
గూడకయుండెడు-గురుతుదెలిపి
యాకాశవాసమై-యాచిదాకాశస్వ
రూపమైయుండెడు-రూపెబ్రహ్మ
తే॥ గీ॥ మీవెయాచిదాకాశమౌ- టెఱుఁగవలయు
ననసియాకాశమూకాశ-మెటులవెలసె
నాత్మయటులున్న నుపమాన-మగుచునుండు
భవ్యసిద్ధేశకలసుఖ-భవవినాశ॥ 48

సీ॥ పెద్దలౌబుధులుచె-ప్పినమాటపాటించు
మార్గంబుశబ్దప్ర - మాణమయ్యె
అమృతాదిభోగంబు - లమరలోకమున ను
న్నవియజ్ఞములుసే - యనవిలభించు
ననిపెద్దలననమ్మి - యజ్ఞముల్ చేసికా
మ్యములొందశబ్దప్ర - మాణమయ్యె

తనువునీవనకనం-తర్ముఖివైచూడ
నానందవిమలసౌ-ఖ్యంబుగాంతు
తే॥ గీ॥ వని గురుండనదేహేంద్రి-యాదులవిడి
శిష్యుఁడంతర్ముఖుండయి-చిద్విశేష
మహిమగనుచుంటశబ్దప్ర-మాణమయ్యె
భవ్యసిద్ధేశకలమళ్ళ-భవవినాశ॥ 49

సీ॥ నిత్యోపవాసియై-నియతుడన్నఁదనువు
కృశియింపకబలసె-నెట్లటన్న
నెవ్వారెఱుఁగకుండ-నితడురాత్రులభుజి
యించుచునుండును-నేకతంబ
యనియెఱుంగుటయెయ-ర్థాపత్తియగుచుండు
దాౘరాంతమందును-దనువునాత్మ
యనుచుండుశిష్యుని-యాత్మదేహామియైన
సచ్చిదానందలక్షణములెట్లు
తే॥ గీ॥ లేకకాలముచేతను-వీకగూలు
సుప్తిమూర్ఛనుమృతియందు-చూడజడము
స్వప్నజాగ్రద్దశలఁగ్లేశ-సరణినొందు
భవ్యసిద్ధేశకలమల్ల-భవవినాశ॥ 50

సీ॥ దేహంబనత్తగు-దేహంబుజడమగు
దేహంబుక్లేశవ-ర్ధితమునుమ్ము
పూర్వపుణ్యముచేత-బుట్టువుమరణంబు
స్వర్గాదిలోకవా-సములుగలుగు

పూర్వమిప్పుడు ముందు - మూడు వేళలనుంట
సత్తునై యుండును - జాలసుప్తి
మూర్ఛాదులనువీడి - ముదమున చిత్తగు
సుప్తిసమాధుల - సుఖమెగాంచు
తే॥ గీ॥ మూడులక్షణములతోడ - మొనయుచుండు
బ్రహ్మమా బ్రహ్మమే నీవు - భ్రాంతివదలి
ముక్తిఁ గాంచుమని గురువు - బోధజేసె
భవ్యసిద్ధేశకలనుళ్ళ - భవవినాశ॥ 51

సీ॥ శ్రుతిస్పష్టసంజ్ఞల - గతులనర్థాపత్తి
రెండువిధంబులై - యుండునందు
గృహమేధి నేఁటఁగ - నెందేని వెదకుచు
నా గృహవాసియుం - చతనిసుతుని
గని భ్రమనొందఁగ - గాడనే నాప్తుఁడు
గురుఁడు దృష్టార్థాది - గరిమజూపి
జీవుని నాత్మగా - శిష్యుండు భావింప
బద్ధజడుడు దుఃఖ - భావుడనియె
తే॥ గీ॥ యశఘ! సచ్చిదానందాది - యాత్మ వేరె
గలడనఁగ? శ్రుతార్థాపత్తి - గాంచుమపుడె
పూర్ణబ్రహ్మము నీవాదు - పుత్రయనియె
భవ్యసిద్ధేశకలమళ్ళ - భవవినాశ॥ 52

సీ॥ ప్రాగ్భావంబుప్ర - ధ్వంసమన్యోన్యంబు
సత్యంతమనగను - నలరునాల్గు

గతులనభావంబు-ఘనచక్రమృత్తికా
దండంబులనుఘటం-బుండబోమి
ప్రాగభావమ్మురూ-పముగొన్నఘటముప్ర
ధ్వంసలయినపిదపలే-దనెడునదియె
ప్రధ్వంసమగుచుండు-పటమందుఘటమును
ఘటమునపటమును-గానబడమి
తే। గీ॥ యదియెయన్యోన్యమగుగగ-నారవింద
మదియెప్పుడులేకయుంటన-త్యంతమగును
నాల్గుగతుల నభావంబు-నెల్గుచుండు
భవ్యసిద్ధేశకలమళ్ల-భవవినాశ॥ 53

సీ॥ మొనసిమాయాసృష్టిపూర్వము-బ్రహ్మము
ఖండమైమాయలే-కుండుటదియె
ప్రాగభావంబగు-ప్రళయమానెన్కమా
యయులేమిప్రధ్వంస-మైతనర్చ
సృష్టియుండగవిచా-రింపబ్రహ్మంబుని
త్యమువెల్గుమాయలే-దనియెఱుంగ
నన్యోన్యమగుచుండు-నదిత్రికాలములందు
బ్రహ్మంబుదప్పనే-వస్తువైన
తే। గీ॥ లేకకుందేటికొమ్మును-నాకసంబు
పూలుగొడ్రాలికొడుకన్న-లీలమాయ
లేదనుటయెందునత్యంత-మైదనర్చు
భవ్యసిద్ధేశకలమళ్ళ-భవవినాశ। 54

సీ॥ ఇతిహాసమునసప్త-మావస్థబోధింపు
డనిగురునతిభక్తి-నడిగినంత
ఆకులుగోయంగ-జోకత్రో నొకనాడు
వటవృక్షమెక్కి న-వాని జేరి
బ్రహ్మరాక్షసునకు-వాసమీతరువంచు
నమ్మదగినవాడు-నెమ్మిబలికి
జనుపుపుట్టించిన-గడగడవడఁకుచు
విడిచియాకులునట్టి-పడవెకింద
తే॥ గీ॥ నటులదార్ష్టాంతమందున-నరయు దేహ
మింద్రియప్రాణబుద్ధులు-నీవుగావు
అహమునిడిచినబ్రహ్మమే-యనియెగురు-డు
భవ్యసిద్ధేశకలమళ్ళ-భవవినాశ॥ 55

సీ॥ దంతిపాదంబున-దనరవేఱగుజంతు
నివహపాదంబులు-నిలిచినట్లు
నూఱునిన్నూఱుము-న్నూఱందుననిమిడి
పెక్కుమొత్తములున్న-వేయికంటె
వేరేమిగాదను-సారమేసంభవ
మనుప్రమాణంబునై-యతిశయిల్లు
బ్రహ్మస్వరూపమా-భావచరాచర
మగుప్రపంచంబెల్ల-దగులుప్రకృతి
తే॥ గీ॥ గానఁగరగతమగునట్టి-జ్ఞానముద్ర
తెలియుమనగనుశిష్యుండు-దెలిసిబ్రహ్మ

మనుచుగురుమూర్తిఁబరశివుఁ-డనితలంచె
భవ్యసిద్ధేశకలమళ్ళ-భవవినాశ॥ 56

సీ॥ అవ్యక్తమునుబుద్ధి-యభిమానపంచత
న్మాత్రలుస్థూలభూ-తంత్రమెల్ల
మాయామయంబునై-మారుచుకార్యంబు
కారణాంతరమగు-కర్మగూడి
పంచీకృతంబున-పంచమహాభూత
నిచయంబులగుచును-నిశ్చయముగ
సశరీరమగుచుండు-సరగుననీరెంట
రమణనిమిత్తకా-రణమునగుచు
తే॥ గీ॥ ఘటములకుముందుమన్ననో-క్కటియినట్లు
బ్రహ్మమాయుపాదానమై-ప్రభవహించు
సదమలానందసన్మాత్ర-సారమగుచు
భవ్యసిద్ధేశకలమళ్ళ-భవవినాశ॥ 57

సీ॥ సుఖముస్వభావంబు-సఖమునాగంతుక
మగుచునుపాదాన-మానిమిత్త
కారణంబులతోడ-గలుగునీశ్వరతత్వ
సృష్టియుభూతముల్-స్థిరముగాగ
భౌతికవిశ్వంబు-బహుభంగులనుబొంది
నిలకులాలునిచేత-గలుగుఘటము
కరణిని దేహముల్-గలుగుచుకర్మంబు
నశియించిపోవుచో-నయముతోడ

తే॥ గీ॥ నపుడు నాశమైయశరీర-మగుచుముక్తి
సుఖముస్వాత్మానభవము నై-సుప్తిసాక్షి
తానుతానగుతత్వప్ర-ధానుఁడగును
భవ్యసిద్ధేశకలమల్ల-భవవినాశ॥ 68

సీ॥ ఆత్మకనాత్మలే-నవ్వలనిమయ
స్వాంతసన్నిధిజేత-భ్రాంతమట్లు
పరగడమున్నజ-పాపుష్పకాంతుల
స్ఫటికంబు గ్రహియించి-వఱలునట్లు
ఇనుమునుగూడివ-హ్నియునుదానిదీర్ఘవ
ర్తుల రూపములనొంది-వెలయుచుండు
ఆయహంకారాప్తి-నాత్మయందిరవుగా
రాగంబు ద్వేషంబు-రమణదోచు
తే॥ గీ॥ భానుఁడీజగద్వ్యాపార-ఫలము లేక
సకలప్రాణుల నెలయించి-సమతనుండు
నాత్మనింద్రియాదివికార-మందకుండు
భవ్యసిద్ధేశకలమళ్ళ-భవవినాశ॥ 59

సీ॥ ఘనకిరణాళిబు-ట్టినమేఘముడ్రమె
యతసికాంతిసిగొంత-యణచినట్లు
అనలంబునను జనిం-చినధూమమేదాని
పైగప్పికొనికాంతి-బాపినట్లు
త్రాటనుబుట్టిన-సర్పభ్రాంతిరజ్జువు
నందలిసత్యంబు-నణచినట్లు

ఘటశరావములుత - ద్గతపూర్వవస్తువై
వెలయుమృత్తునుమఱ - పించినట్లు
తే॥ గీ॥ స్వర్ణమున నైనసొమ్ములు - ప్రథమరూప
మైనబంగారుమఱపించి - యమరినట్లు
పంచకోశముల్ గప్పగా - బ్రహ్మముండు
భవ్యసిద్ధేశకలమళ్ళ - భవవినాశ॥ 60

సీ॥ ఖడ్గరాజమునొఱ - గప్పినచందాన
గవిసెనతంబుర - గప్పినట్లు
మొగివడ్లగింజకు - పొట్టున్నకరణిని
చింతపండుకుచుట్టు జింతగుల్ల
గప్పినట్టులనాత్మ - గప్పుచుపంచకో
శములనునుపజీవ - నమునుగలిగి
దేహమనోప్రాణ - ధీమయానందకో
శములాత్మగప్పియు - చాటుచేసి
తే॥ గీ॥ బ్రహ్మమధ్యానధర్మస్వ - భావముగుచు
నట్లుదోచునుఖడ్గంబు - నందునొరయు
భిన్నమైయుండునాత్మయు - వేఱయగును
భవ్యసిద్ధేశకలమళ్ళ - భవవినాశ॥ 61

సీ॥ తైలంబుపాత్రియు - తైలంబుచేదడి
సినవత్తియున్నియు - జేరియుండు
వత్తిదాదోచక - పాత్రతైలాదుల
వెల్లడిగాగదో - పింపలేదు

న్తినధిష్టించి - వర్తించునగ్నియు
సాధనంబును లేక - స్థాలి మొదలు
సర్వవస్తువులను-చక్కగా దోపించు
చొప్పున వెలయుచు - స్థూల దేహ
తే। గీ॥ కర్మమునములబ్రహ్మంబు - కలసిమెలఁగి
సాధనము లేక దనుదాని - జాలవెలుఁగు
నన్నియునువెల్గఁ జేయును - ననలుమాడ్కి
భవ్యసిద్ధేశకలమల్లి - భవవినాశ॥ 62

సీ॥ శుద్ధుండుపరమాత్మ-శ్రుతులకందగ రాక
సన్మాత్రముననుండు - సర్వమయత
అన్యకసుప్తియం-దానందరూపమై
దృశ్యమాయనుజూచు - దృశ్యస్వరూప
నిరాశ్రయుఁడగుచుండు - శాశ్వతసాక్షియై
దృగ్దృశ్యములు రెండు - నేకమగుట
ఉరుతరాహంకార-గరిమమహాత్తునై
చిత్తంబువిమయాశ - చేతనిలుచు
తే। గీ॥ సుప్తినేమియుదోచని-శూన్యశక్తి
శక్తిగజతంబువలెనిల్చు - సుఖమెయాత్మ
యతడుదృక్కుయియంతట - నావరించు
భవ్యసిద్ధేశకలమళ్ళ - భవవినాశ॥ 63

సీ॥ కల చిదాభాసమై-కలుగుచుమిధ్యయై
సత్యంబుగానట్టి - సగుణజగము

గల్పించుదానిలో-గలసినయాజీవుఁ
డుగుతరసుఖదుఃఖ-కరుఁడునగుచు
బరగుదేహేంద్రియ-ప్రాణమానసగుణ
కర్మంబులందభి-గమ్యుఁడగుచు
రాగంబుక్రోధంబు-రయమునలోభంబు
భయశోకమోహాది-ఫలముగుడుచు
తే॥ గీ॥ నీశ్వరాధీనుఁడాజీవు-డెపుడుజడత
నన్నిగతులందునంకుర-మగుచుదోచు
భ్రాంతిలేకుండపరమాత్మ-వఱలుచుండు
భవ్యసిద్ధేశకలమళ్ళ-భవవినాశ॥ 64

సీ॥ జాగ్రత్సదాభాస-సత్తునబెంపొంది
జీవుండుబహువిధ-చిత్రగతుల
నంకురంబునవృక్ష-మటదోచువిధమున
స్వప్నంబుజాగ్రద్వి-కాలమగుచు
వివిధరూపంబుల-వెలయుచుమానస
వాచకకాయిక-ప్రాణవృత్తు
లన్నియుసత్యంబు-లగుచుండిదోచును
నిర్వికల్పనిరూఢి-నిలిచియుండు
తే॥ గీ॥ కార్యభూషణరూపము-లాకరణంబు
లగుచుస్వర్ణంబుతన్మాత్ర-మగుచువీని
ఫలముబ్రహ్మంబెజగమగు-ప్రకటముగను
భవ్యసిద్ధేశకలమళ్ల-భవవినాశ॥ 65

సీ॥ నిద్రయందానంద-నియతిగల్గుటనుభా
వాభావములుపుట్టు-టచటలేదు
స్వప్నజాగరములు-సమతసుప్తినినాస్తి
యనిరెంపునొండొంట-యణఁగువేళ
స్వప్నమనోరథ-స్వారాజ్యమంతయు
పుట్టుకయేలేక-పోవుచుండ
వఱలెడుజాగ్రద-వస్థనిజంబౌనె
గొడ్రాలికొడుకుదా-గుణనుగూప
తే॥ గీ॥ శీలయౌవనయుతుడగుఁ లీలదనరు
నతనివ్యవహారమంతయు-నతముగాదు
నాత్మయేబంధనములేక-యలరుచుండు
భవ్యసిద్ధేశకలమల్ల-భవవినాశ॥ 66

సీ॥ స్థావరజంగమా-త్మకమైనయీవిశ్వ
మునుమాయమరులచే-ముంచివైచి
భ్రమమునుగల్గించు-భ్రమయేవికల్పమై
యాశ్రయించుచునుండు-నాత్మనెపుడు
చిత్తంబవిద్యను-జేరుటజీవుండు
భవబంధములచేతఁ-బల్లటిల్లు
కామకర్మఫలంబు-గలవాడననియెంచు
నభిమానదేహేంద్రి-యములుమనను
తే॥ గీ॥ ప్రాణమునుబుద్ధియునుగల-వాడనునుచు
దలచుచుండియుఁసుఖదుఃఖ-ఫలముగుడుచు

నిర్వికల్పునకివియన్ని-నిజముగావు
భవ్యసిద్ధేశకలమఠ్ళ-భవవినాశ। 67

సీ। జీవునినిజరూప-భావంబుపూర్తిగా
మఱపింపజేయుచు-మాయయనఁగ
అదిమహాసుప్తియై-యావరించినయంత
తననిజరూపంబు-దానుగనక
పతితత్వమునుబొంది-పలువిధకర్మంబు
లాచరించుచునుండు-నతఁడు దేశ
కాలపాత్రాదినం-స్కారవశంబున
పరితాపమొందును-బహువిధముల
తే। గీ। నట్టిజీవునిమరణంబు-నంత్యమందు
వస్తువందుననగుచుండు-వస్తువెపుడు
నిర్వికల్పమై శుద్ధమై-నిల్చియుండు
భవ్యసిద్ధేశకలమఠ్ళ-భవవినాశ। 68

సీ। వస్తువున్నదిలేదు-వాసిగాననియును
చెప్పసాధ్యముగాద-చింత్యమగుచు
వస్తుభావముననె-ప్రభవించిచిత్తగు
చిత్తానుభవమున-జేరిసర్వ
జీవజంగంబులు-లేవవినూత్నమై
స్థూలమైవెలయును-చోద్యముగను
విత్పశ్రీధానముగాగ-స్థిరసర్వవిద్యాది
పారంగతత్వంబు-పరగియాశ్వ

తే। గీ। రానుభవముగలిగినను-తానులాభ
మించుకేనియుఁగోరక-గాంచుముక్తి
పుట్టిగిట్టినివరిపూర్ణ-దట్టియాత్మ
భవ్యసిద్ధేశకలమళ్ళ-భవవినాశ। 69

సీ। అసుదాగదేశకా-లాదిరూపములెల్ల
ఆవిచారాతీత-మైనవస్తు
వనకుసాధనములై-యొనరకయోపైని
జీవసాధనములై-చెలఁగుచుండు
త్రిగుణరూపమునొంది-స్థిరమౌచుమాయన
త్త్వరజస్తమోగుణ-ప్రథితమయ్యె
రహిస్థూలసూక్ష్మకా-రణమహాకారణ
గతినొందిపరమాణు-కలనగాంచు
తే। గీ। మొదటిమూడిటనులినమౌ-పిదపశుద్ధ
మగునుమలినతజ్ఞానమై-న్యంబుగూర్చు
శుద్ధతయుదెచ్చుజ్ఞానవి-స్ఫూర్తినెపుడు
భవ్యసిద్ధేశకలమళ్ళ-భవవినాశ। 70

సీ। పరమాత్మకన్నను-పరమసూక్ష్మములేదు
వ్యోమముమొదలుగ-భూమివరకు
భూతాదులన్నభో-భూతంబుసూక్ష్మంబు
పృథివియుస్థూలంబు-పిదపస్థూల
దేహాదులనుబొంది-దిరుగుచుపురుషుండు
నేనునాయదియును-నేర్పులేక

విషయసంతానంబు-విషమమైతనుబొందఁ
మానసవేగంబు – మానలేక
తే। గీ। సకలఫలములుతనవని-విశలుఁడగుచు
త్రాటకట్టినపసరంబు-పాటునొందు
గడకవిషయాళిబాసిన-గాంచుముక్తి
భవ్యసిద్ధేశకలమళ్ళ-భవవినాశ। 71

సీ। దేహమేననెడుబు-ద్ధినిరూఢిగలిగిన
కోరికలవియెల్ల-నీఁకెత్తు
కర్మపాశములచే-గట్టిగాబంధింప
బడుచుండుజీవుఁడా-బంధమితని
నెవ్వరుతప్పింప-నెవ్వగనేరరు
తనబంధమడఁగింప-దానెకర్త
విజ్ఞాననిధియగు-వేదాంతసంవేది
సువిచారరూపుని-సుమతిగురుని
తే। గీ। చరణపద్మములందసం-సారదుఃఖ
మెడలజ్ఞానతేజంబన-బడుప్రబోధ
మాత్మఁదెలిపినతోడ న-నాత్మఁజెడును
భవ్యసిద్ధేశకలమళ్ళ-భవవినాశ। 72

సీ। పరతత్త్వమెఱిఁగియు-వరగుణాఢ్యుండైన
దేశికోక్తులబోధ-దెలియువాఁడు
ఇలగల్గుదూరయాత్రలుపుణ్యతీర్థముల్
బహుళదుర్భరయోగ-భారములును

మంత్రంబుతంత్రంబు-మహిమలుసిద్ధులు
సాంఖ్యయోగాదులు-చదువులెల్ల
మాటలపొంకంబు-మరిశాస్త్రవాదంబు
లన్నియుభ్రమయని-యాత్మనెంచు
తే। గీ॥ శ్రద్ధతోవినయంబుతో-శుద్ధబుద్ధి
నెపుడుగురుమూర్తిసేవించి-యెదురులేని
బ్రహ్మమందునగలియును-భ్రాంతిపిశ
భవ్యసిద్ధేశకలమల్ల-భవవినాశ॥ 73

సీ॥ బ్రహ్మవస్తువుదాను-బ్రహ్మమేనను పెట్టు
లాజగచ్ఛక్తిని-వరయకున్న
నిద్దంపుటద్దాన-నిలచినఛాయయై
బుద్ధిలోనగపడు-భూరిజగము
దేహేంద్రియాదిక-దృశ్యంబుప్రాణంబు
వ్యోమాదిభూతము-ల్గామషట్క
సుఖదుఃఖవిషయముల్-నిఖిలలోకంబులు
మాయయుసర్వంబు-మరినాత్మ
తే। గీ॥ బుద్ధితానాఁ నటులనే-పురుషుడాడు
బుద్ధిచేసన్నుదెలియదా-బుద్ధిగలదె
బుద్ధినశియింపసిద్ధమా-బోధమిగులు
భవ్యసిద్ధేశకలమల్ల-భవవినాశ॥ 74

సీ॥ బుద్ధినశించిన-శుద్ధచైతన్యంబు
దానైనవస్తువు-తీర్ద వెలుఁగు

బంధముక్తులుగల - వాడనటంచుజీ
వుఁడు చేతనచ్ఛాయ - పొందిమెలఁగు
బ్రహ్మమేతప్ప నే - వస్తువు లేదుబ్ర
హ్మమెజగద్రూపమై - యలరునిదియు
కాకిగోయిలపెంపు - గాంచుచుసుఖదుఃఖ
కలితుఁడైజీవుండు - కలతనొంది
తే। గీ॥ సమతగోయిలగోయిల - సంగమమర
సమరసానందమయమగు - సత్యవస్తు
రూపమొందునుదృగ్దృశ్య - రూపుబాసి
భవ్యసిద్ధేశకలమళ్ళ - భవవినాశ॥ 75

సీ॥ రవియగ్నికణమును - రాజునుభటుడును
అణువు మేరువుకూప - మంబుధియును
మహదణుభేదసం - పత్తిచేనొప్పిజీ
వునుపాధిచేచుట్టు - ముట్టియుండు
మహదాదికారణ - మాయచేపంచకో
శంబులుగప్పును - సత్యమగుచు
జ్ఞానముడాచియ - జ్ఞానమైయున్నట్టు
కనఁబడజేయును - గానభ్రాంతి
తే। గీ॥ బాసిజూచినజీవుండు - బ్రహ్మమేక
విధియధార్థమఖండమై - వేరుగాక
సంతతామితబహుసుఖ - స్థాయిగాంచు
భవ్యసిద్ధేశకలమళ్ళ - భవవినాశ॥ 76

సీ॥ జాగ్రదావస్థయా - స్వప్నంబునను లేదు
స్వప్నంబుసుషుప్తి యం - శమున లేదు
అసుషుప్తియుతురీయ - మందుగానగరాదు
అటు రీద నాతురీ - యంబు గూడ
పరతురీయాతీత - పదమునుగన లేదు
గన స్థూలసూక్ష్మంబు - కారణంబు
యూను మహాకారణ - మ ఫుడు లయముగాగ
నదియువి దేహమై - నట్టిముక్తి
తే॥ గీ॥ నవ్యయాఖండమూర్తియై - నట్టిజ్ఞప్తి
శుద్ధనిర్మలపరిపూర్ణ - సిద్ధపదవి
నిర్విశేషము సత్యమై - నిలిచి వెలుఁగు
భవ్యసిద్ధేశకలమళ్ళ - భవవినాశ॥ 77

సీ॥ దహనేతి దేహము - నిహమందునుదువుట
దహియింపబడునంచు - దలపరాదె
స్థిరముగాశీర్యతే - తిశరీరమనుట చే
నయ్యదిశిధలమౌ - నని యెఱుఁగరో
మాంసపిండమిదెంత - మహిమతో నొప్పిన
నిత్యంబుగాదని - నేర్వరాదె
మోహవశంబున - దేహమేననునరు
డతిమలభాండదు .ర్గతియు హేయ
తే॥ గీ॥ రూపమగునట్టిదీనిని - రూఢినాత్మ
కర్మభోక్తయనను భ్రాంతి - కలఁతగాంచు

బ్రహ్మమెపుడైన దేహంబు-పరగనగునె
భవ్యసిద్ధేశ కలమళ్ళ-భవవినాశ॥ 78

సీ॥ పంచభూతంబుల-పంచీకృతంబైన
నస్థియుమాంసంబు-నమరనరము
లారక్తశుక్లంబు-లాదిగాభూసలి
లాగ్నివాయ్వభ్రాదు-లైనయట్టి
భూతపంచకమున-బుట్టును దేహంబు
పురుషరూపంబున-పూర్వకర్మ
వశుడయిజీవుండు-పరపురాన్వేషియై
దేహమేననిగూడి-తిరుగులాడు
తే॥ గీ॥ పెక్కుజన్మములందును-బెచ్చుపెరిగి
దేహిబొందునుభవమును-త్రాహియనుచు
సకలవికృతులుబాసిప్ర-శాంతుడగును
భవ్యసిద్ధేశకలమళ్ళ-భవవినాశ॥ 79

సీ॥ బ్రహ్మండభాండంబు-పరగుదేవలమయ్యె
బ్రహ్మండమందున-పరగనిలిచి
పిండాండమమరుస-నిండారుగర్భాల
యంబునైమేలుగా-నదియునిలుచు
చిత్తంబుపీఠమై-సిద్ధివహించును
చిత్తపీఠమునందు-స్థిరుడునగుచు
చైతన్యలింగంబు-చరితార్థమగుబ్రహ్మ
శివరూపధారియై-చెలఁగుచుండు

తే॥ గీ॥ చేతనాధార దేహాళి–చిత్రగతుల
నాట్యరంగమునలుపుచు–నటునిభంగి
పరుడయినపరబ్రహ్మమే–ప్రబలుచుండు
భవ్యసిద్ధేశకలమళ్ళ-భవవినాశ॥ 80

సీ॥ జీవుండుతనువునఁ–జేరిస్థూలశరీర
మాధారముగగొని–యందునిలుచు
నొగిమనస్సునుబుద్ధి–యును రెండు కర్మేంద్రి
యములైదు జ్ఞానేంద్రి–యంబులైదు
ప్రాణంబులైదునీ–పదునేడుగలసియు
సూక్ష్మదేహముగబో–ల్చునునిజంబు
దానినే వాసనా-తనువనుచుందురు
గావునఘనబంధ–కారియగును

తే॥ గీ॥ ద్రుంపనేరనివారిని-ద్రుంచుచుండు
నదియునేనన కెప్పుడు–నాత్మనిష్ఠ
బ్రహ్మమేనని ప్రాజ్ఞుండు–వడయుముక్తి
భవ్యసిద్ధేశకలమళ్ళ-భవవినాశ॥ 81

సీ॥ వాసనాక్షయముశా–శ్వతముక్తిహేతువౌ
ననుచుంద్రువిరివిగా-ఘనులుబుధులు
సంసృతి బహుళక-ష్టములమూలంబంద్రు
సంసారమందగ-సకలక్రియలు
ప్రేరేపణముజేసి–ప్రియమునుబుట్టించు
సకలకర్మంబుల-జాడనొదుగ

జేయుచు బ్రహ్మంబు-స్థితిగాన లేకుండ
పారంబు లేకెప్డు-పాఱుచుండు
తే॥ గీ॥ పుణ్యవశమునవిశ్వంబు-బూర్ణముగను
బ్రహ్మమేనను దృఢతర-భావమొంద
నేతి నేతిమహావాక్య-రీతి నెరవు
భవ్యసిద్ధేశకలమళ్ళ-భవవినాశ॥ 82

సీ॥ అజ్ఞానమూలమై-నట్టి కారణశరీ
రంబనునొకటికా-రాగృహంబు
నిదియుఃజన్మంబుల-నెన్నియోదెచ్చుచు
నన్నిదుఃఖములను-నందజేయు
బ్రకృతియఃవిద్యయ-న్వికృతినిదగిలియు
వాననాస్ఫూర్తిచే-పాపజనిత
సంసారమునుబుద్ధి-సక్తతగల్పించు
కొని బ్రహ్మనిష్ఠచే-కూడనీదు
తే॥ గీ॥ నట్టితనువును జెఱుపంగ-నగునుజ్ఞాని
యాత్మనిష్ఠులగోష్ఠియు-ననిశముదుగ
నాత్మమాత్రమెయగునన-నాత్మగాక
భవ్యసిద్ధేశకలమళ్ల-భవవినాశ॥ 83

సీ॥ కారణపుశరీర-మారయబీజమా
యహామనుతత్త్వంబు-నదియుజెలిచి
శుద్ధసత్త్వమునగ-సిద్ధపదంబున
నదిమహాకారణ-మనగనెగడు

దీని నేచిత్తని, దృక్కని, -దృశ్యాను
విద్ధ, మనియునరియు - వివిధగతుల
నిర్మలనిస్సంగ - నిరుపద్రవంబని
నిర్వికారమనియు - నిర్వికల్ప
తే। గీ॥ మనిస్స్వయంప్రకాశమనిన - త్యంబటండు
రవ్యయాఖండకూటస్థ - మైనబ్రహ్మ
మాత్రతవెలయువిజ్ఞాన - మయుమజ్ఞాని
భవ్యసిద్ధేశకలమళ్ళ - భవవినాశ! 84

సీ॥ నిజవిలాసోల్లాస - నిశ్చయబ్రహ్మమం
దజ్ఞానబద్ధుడై - యాదిలేని
కాలంబునుండియు - కడుపడిసంసార
పంకంబునందున - బడియు భ్రాంతి
వదలక జీవుండు - బాధలఁబడుచుండు
భూరితత్త్వరహస్య - ములను దెలిసి
విజ్ఞానదృష్టిచే - వేదాంతగమ్యమా
లలితపరబ్రహ్మ - లక్ష్యమెఱఁగి
తే। గీ॥ శక్తిగొలఁదివిచారింప - ముక్తియిట్టి
దని తెలియుదానునాసక్తి - యంతరించు
జీవి తేజస్స్వరూపుడై - చెలగునపుడు
భవ్యసిద్ధేశకలమళ్ళ - భవవినాశ! 85

సీ॥ అవ్యక్తబీజమై - యలరారుమాయ బు
ద్ధియుస్కంధరూపమై - తేజరిల్లు

అహామనునదిపల్ల – వానీకమగుమనం
బునుదశేంద్రియవర్గ – ములునుతోఁట
లావలసూక్ష్మేంద్రి – యమ్ములుపంచత
న్మాత్రలుపెద్దకొ – మ్మలుగదనరు
పంచమహాభూత – పంక్తియురెమ్మలై
యాకులుపుష్పంబు – లమరుచుండు
తే। గీ॥ నదిశుభమశుభములనెల్ల – నందుబ్రహ్మ
మానసాతనవృక్షంబ – య్యెదలిర్చు
దాని జ్ఞానాసిఛేదింపఁ – దనరుముక్తి
భవ్యసిద్ధేశకలమళ్ళ – భవవినాశ॥ 86

సీ॥ సప్తాశ్వకిరణంబు – చదలఁబ్రకాశించి
బ్రహ్మాండతిమిరంబు – బాపినిలుచు
చందాన, నాత్మయు – చక్కగాదేహంబు
లోనుండివెలుపలి – లోకములను
నామరూపములెల్ల – నయముగావెల్గించు
మానససంయోగ – మహిమచేత
మనసుదేనినిగూడి – మరగిచరించునో
దానిరూపునుదాల్చు – తథ్యముగను
తే। గీ॥ పెక్కువిధభేదములనుగ – ల్పించి, నీచ
గతులగలిగించి, భ్రాంతుల – నతుకుమనసు
నదియుశుద్ధసమాధిలో – నణఁగముక్తి
భవ్యసిద్ధేశకలమళ్ళ – భవవినాశ॥ 87

సీ॥ బ్రహ్మవిద్యాభ్యాస-బలనిరూఢిని మతి
సాధుసంగమమును-సలుపుటయును
మలినవాసనలను-దొలఁగఁ బెట్టుటచేత
మరియుఁ బ్రాణాయామ-నిరతిచేత
మనమధీనము జేసి-కొనుచునేకాగ్రభా
వము గాయకుండుటే-పరమశాంతి
యనుభూతియందున-నాశాంతిగలసదా
చారపరుఁడె చాల-ధీరుఁడగును
తే॥ గీ॥ మనసు గెలిచినముక్తిసం-పదయుఁగలుగు
సుఖరసానందపదమును-జొనుపుచుండు
తానుతానగుతత్త్వసం-ధానగరిమ
భవ్యసిద్ధేశకలమల్ల-భవవినాశ॥ 88

సీ॥ మొనసిభావాద్వైత-మును క్రియాద్వైతము
లనరెండు తెరగులై-యతిశయిల్లు
చిద్విశేషవిలాస-చిహ్నితమగుచుభా
వాద్వైతమది శ్రేష్ఠ-మైతనర్చు
పూర్ణయోగాభ్యాస-మునక్రియాద్వైతము
తగుగానిదొలుతటి-దానిమీఁద
దన్ని యోగములకు-బ్రాణమట్టుండుప్రా
ణాయామమద్దాని-నాత్మదృష్టి
తే॥ గీ॥ విశ్వమది రేచకంబున-నశ్వరమని
పూరకంబునబ్రహ్మమే-ముఖ్యమనుచు

కుంభకంబునదృఢమని - కూడముక్తి
భవ్యసిద్ధేశకలమళ్ల - భవవినాశ। 89

సీ॥ లేనిజగంబులు - లేకనేదోఁచెడు
నున్నవానినిగన - కున్నకతన
ఉన్నవానిగనలే - కున్నట్టిజగమెల్ల
మిన్నకే లేనిదై - మెలఁగుచుండు
ఉన్నదినిజమైన - నొనరయత్నించిన
పోవునేయదిలేక - పూజ్యముగను
లేనిసంసారంబు - లేనియర్థంబుల
లేనిమనసుతోడ - లేకదోఁచి
తే। గీ॥ యన్నియునుమనోలయమున - నాగియాత్మ
సుఖమునదనయంతనదియు - శుద్ధవస్తు
వమృతరూపొందివెల్గొందు - నాద్యనుగుచు
భవ్యసిద్ధేశకలమళ్ళ - భవవినాశ। 90

సీ॥ మనసుసుషుప్తిలో - మగ్నమైయున్నప్పు
డేమియుతోఁపక - నెనగియుండు
నదివడివెలిదోఁచి - యంకురించినయప్డు
కలయుగునపుడులో - కములుగలుగు
బ్రహ్మంబుమొదలుస్తం - భముదాకనీవిశ్వ
మంతయుమానసం - బైయెసంగు
నీశుండుమాయయు - నీజగద్వ్యాపృతి
సకలఁబుమనసున - సంభవించి

తే॥ గీ॥ దానిచేబంధమోక్షముల్ దనరుచుండు
గానమానసముజయించి - ఘనుడువిజ్ఞు
డమితగతినాత్మరతినల్పు - నహరహంబు
భవ్యసిద్ధేశకలమళ్ళ - భవవినాశ॥ 91

సీ॥ అమనస్కుడై యుండు - నతడెవిజ్ఞానియౌ
నామనసువిలీన - మైనయతని
కపవర్గము కరత - లామలకంబగు
నామరూపాదిగు - ణప్రపంచ
మదిమనఃకల్పితం - బగునష్టబ్రహ్మంబు
తెలియనేరకయట్టె - నిలిచియుండు
తెలియనియాత్మయే - తెలియునాత్మయై
మాయావికారమి - మ్మాడ్కిగలిగె
తే॥ గీ॥ మహితమాయావిలాసమ - ర్మంబు తెలియ
తనదుసదసద్విలాసభే - దంబు తెలియు
భవములేనట్టిబ్రహ్మంబు - పరగవెలయు
భవ్యసిద్ధేశకలమళ్ళ - భవవినాశ॥ 92

సీ॥ చిత్తుచేజగములు - సిద్ధ మాచిన్మాత్రి
చిద్బిందురూపమే - చిత్తుమాయ
మాయావిలాసమే - మహితాత్మయందుండు
చిన్మయాకారమై - చెలగుచుండు
బుద్ధిదేహముజగం - బులుమూడుమనసును
చిత్తుచేతనుదోచి - స్థితినిబొంది

సువివేకదృష్టిచే-శూన్యమా బ్రహ్మమే
సాక్షి తేజమఖండ-సత్యమూర్తి
తే। గీ॥ మాయగలియుటతన్నదా-మరుగెపఱచు
సారసాప్తునఖండైక-చండకిరణ
మెటులనటులాత్మకిరణంబు-లెపుడువెలుఁగు
భవ్యసిద్ధేశకలమళ్ళ-భవవినాశ॥ 93

సీ॥ సంస్కారబలమున-సకలంబుచిత్తుచే
రూపనామములెల్ల-రూఢినాత్మ
బోడముచుండున-వాని-పోడచూపనీకుండ
శ్రవణంబుమననంబు-సత్ప్రవృత్తి
సజ్జనస్నేహంబు-సలుపుచునధ్యాత్మ
తత్వరహస్యసం-దర్భమెఱిగి
సువివేకియైజ్ఞాని-సోకదువిభ్రాంతి
మమతబాసియసంగ-మహితుఁడతఁడు
తే। గీ॥ ఘనతవిన్నవిల్లనుదాను-మననమందు
పదిలపఱచియుపరతత్వ-భావమున నె
వరనిధిధ్యానసంపత్తి-పరముగాంచు
భవ్యసిద్ధేశకలమళ్ళ-భవవినాశ 94

సీ॥ ఏదివిన్ననుగాని-యేదికన్ననుగాని
శబ్దదృశ్యములెల్ల-శక్తిగొలఁది
తనకన్నవేఱుగా-దలపకశ్రద్ధతో
బఱగుచునాత్మాను-భవముకలిమి

యెపుడుమానసయోగ - మెడపకచవిగొని
శబ్దదృశ్యంబుల-జాడఁజనక
రూపశబ్దాదులా-రూఢితోఁజిమ్ముచు
సద్బ్రహ్మరూపంబు-జాలగనుచు
తే। గీ॥ పరమశాంతునినిశ్చల-స్వాంతమెపుడు
పవనచలితముగానిదీ-పంబురీతి
నిర్వికారమఖండమై-నిలిచియుండు
భవ్యసిద్ధేశకలమళ్ళ-భవవినాశ॥ 95

సీ॥ ఘనమనోవాక్కాయ-కర్మంబులనువట్టి
త్రికరణజనితమౌ-సకలకర్మ
లెపుడుచేయుచునుండి-నెడతెగకెందును
వాగ్వైఖరీయుత-బ్రహ్మతేజ
మాత్మభావనమున-నాత్మచింతనమున
నాత్మనిష్ఠులగూడి-ననయముండి
ఘనకర్మములబాసి-గడుప్రబోధంబున
బ్రహ్మభావమునను-పర్యటించి
తే। గీ॥ యాత్మతృప్తినిగాంచియా-ర్యజనసేవ
సంగమెల్లనుబాసి ని-స్సంగుడగుచు
మునియు కాలముగడుపును - మోదమలర
భవ్యసిద్ధేశకలమళ్ళ-భవవినాశ॥ 96

సీ॥ తోచుదృశ్యము లేక-చూచువస్తువు లేదు

చూచువస్తువు లేక - దోచబోదు
తోచురూపము లెల్ల - చూచువానిప్రకాశ
మహిమచే నెదుట నే - మాయతోడ
తనుదాను దెలియక - తానెదోచుటలాయె
మాయ లేకను తన - చాయగను నె
మాయాసహాయుడా - మర్మజ్ఞుడాతడు
తన్నెఱింగిన మాయ - దలగకున్న
తే॥ గీ॥ యెదురు లేకున్న బ్రహ్మంబు - నెఱుగరాదు
బ్రహ్మ మెఱిగిన ప్రకృతిదా - బాసిపోవు
నద్వితీయసుఖానంద - మబ్బునపుడె
భవ్యసిద్ధేశ కలమల్ల - భవవినాశ॥ 97

సీ॥ ఉపశమదమ తితి - క్షోపరతులు శ్ర
ద్ధానసమాధానసా - ధనములాఱు
నలవడ జేయువాడవికారబ్రహ్మంబు
నిశ్చలంబుగ దాను - నిలిచియు బహి
రంతరింద్రియముల - నన్నిటి వశమందు
నుంచుకొనుచు తితి - క్షోపరతుల
విషయవకరూఢిమై - పెంపగ వైరాగ్య
తత్త్వబోధంబుహా - స్తంగతము గు
తే॥ గీ॥ నింద్రియవికారములడంగి - యెఱుక గలిగి
బ్రహ్మవిజ్ఞాన మొదవి శా - శ్వతసవాధి

మోక్షసామ్రాజ్యమబ్బునం - పూర్ణకళల
భవ్యసిద్ధేశకలమళ్ళ - భవవినాశ! 98

సీ॥ జ్ఞానవైరాగ్యవి - జ్ఞానోపరతులచే
ప్రజ్ఞావిశేషంబు - బలముచేత
అలఘుదివ్యాభేద్య - మా బ్రహ్మవిద్యచే
వేదమాతయుచాల - వెలయుచుండు
నావేదమర్మంబు - లన్నియు దెలిసిన
పరమవిజ్ఞానియా - గురువరేణ్య
చరణముల్ గొలిచిత - త్సాహాయమునజ్ఞాన
వహ్నిచే కర్మాది - పాపదహన
తే। గీ॥ మొనర జేసినకర్మంబు - లొదిగిపోయి
మబ్బువాసినచంద్రుని - మాటిక్రిందోచి
యాత్మయునఖండ తేజమై - యలరుచుండు
భవ్యసిద్ధేశకలమళ్ళ - భవవినాశ॥ 99

సీ॥ సందినిపందిగా - పందినినందిగా
పాండిత్యబలమున - బలుకునట్టి
పండితమండలి - ప్రాభవమొల్లక
కావ్యనాటకతర్క - గతులజనక
కోటివిద్యలు పొట్ట - కూటికేయనినమ్మి
దాని పై భ్రాంతిని - వదలిపెట్టి
ఘనభవాబ్ధినిదాటి - గదుబ్రహ్మవిద్యచే
పరసంగరహితుడౌ - బ్రహ్మవిదుని

తే। గీ। యీశ్వరోపముగురుగొల్చి-యింద్రభోగ
మేసి శాశ్వతమనక దా - నెపుడు మేను
బుద్ధిలేనట్టివర మొందు-శుద్ధమౌని
భవ్యసిద్ధేశకలమళ్ళ - భవవినాశ। 100

సీ। వితత శైవాలసం-వృతపారజలముల
గొనబోకకడుదప్పి-గొనుచు, నెండ
మావులవెనువెంట-బోవుమందునిరీతి
కర్మకాండము లెల్ల-గట్టుకొనక
శైవాలగతినొప్పు-శారీరబద్ధుడౌ
యాత్మయెల్లపుడు బ్ర-హ్మంబటంచు
వచియించునామహా-వాక్యంబునని శంబు
తనమానసమునభ-ద్రముగనుంచి
తే। గీ। బ్రహ్మభావన జేయుచు-భవవిరక్తి
నచటనిలిచిననేగిన-నెఱుకగలిగి
వర్తనము చేయువాడెపో-బ్రహ్మమౌని
భవ్యసిద్ధేశకలమళ్ళ - భవవినాశ। 19

సీ। రత్నాకరమునక్షా-రజలంబునిలిచిశు
ద్ధాంబువుల్ రవిరశ్మి-నాకసమున
వరలిమేఘాకృతి-వర్షించుకరణి బో
ధానందసాగరం-బందువెలయు
పరమరసామృత-వర్షధారలఁదొప్ప
దోఁగుచుఁబ్రహ్మసా-ధుత్వమెరిగి

పద్యపద్యంబున - పరమసిద్ధేశుండు
మకుటమందున నొప్పు - మహిమగాంచి

తే॥ గీ॥ బ్రహ్మవిత్పాదపంకజ-భక్తుఁ డైన
కొట్టమన్వయవారాసి-కుముదహితుడు
రమ్యగుణుఁడు రామస్వామిరచన జేసె
గ్రంథమిద్యదిసిద్ధేశు - కరుణవెలయ॥ 102

శ్రీ ఆత్మబోధసిద్ధేశ్వరశతకము
సంపూర్ణము.



ప్రొద్దుటూరు శ్రీజానకీముద్రాక్షరశాలయందు ముద్రితము. 1930.

# అనుభవచికిత్సాదర్పణము.

మూడవకూర్పు — మంచికాగితములు. — సొగసైనఅచ్చు

ఈగ్రంథమున ఔషధములనుచేయుపట్టు బయలుపెట్టబడియున్నవి ఏబది సంవత్సరములుగ లోకమునందనేక స్థలములందు ఉపయోగింపబడి యనేకులను రక్షించిన బ్రహ్మశ్రీ వైద్యపండిత లోకరాజు వసంతపురం మునెయ్యగారి అనుభవములో వాడి గుణమిచ్చిన ఔషధములను గొంచెమయినను మరుగుపెట్టక బాలుర సహితము నమ్మకముగా యివ్వతగిన ఔషధములనుజేయు పద్ధతులను వ్రాయబడినది.

ఈపుస్తకపు సహాయమున ఎంతమాత్రపు ప్రాథమిక వైద్యజ్ఞానము గలవారయినను తమంతటతామే ఔషధముల చేసికొనగలరని మానమ్మకము. ఈగ్రంథమునందు సుమారు 500 పుటలు. 1800 చికిత్సలు చేయుటకు చక్కని తేనెలొలుకు తేటతెనుగు పద్యములు బాలురకు సహితము అర్థమగునట్లు అచ్చటచ్చట కఠినపదములకు తెలుగుటీకతో సహా వ్రాయబడినది.

ఈగ్రంథమునందలి చికిత్సలలో నొక్కటియైనను గుణమునివ్వుటకు తప్పినదని రుజువుచేసిన సొమ్ము వాపసుయివ్వబడును. వెల 2 8.0

## విషప్రతివిషమంజరి.

అనుభవచికిత్సాదర్పణము, నాడీనక్షత్రమాల మున్నగు గ్రంథములను రచించి జగత్ప్రసిద్ధిగాంచిన లోకరాజు వసంతపురం మునయ్యగారిచే రచియింపబడినది.

ఈగ్రంథము మితిమీరి భుజించిన ప్రతివస్తువునకును విరుగుడులను తేట తెలుగు పద్యములుగా వ్రాయబడినది అన్నివిధములైన గడ్డదినుసులు కూరకాయలు, పలువిధములైన ఫలములు, అన్నిమాంసములు, విషపదార్థములు, తేలు, పాము, జెఱ్ఱి మొదలగు విషజంతువులు, చీమలు నల్లుల బాధలను తొలగించు పద్ధతులను కాపులేని మామిడిచెట్లకు కాపునిచ్చుపద్ధతులను ఇవియవి యననేల ప్రపంచమున సామాన్యముగ దొరుకు అన్నివస్తువులను పొరపాటున భుజించిన అన్నిటికిని విరుగుడులును ఈగ్రంథమున చక్కగ వర్ణింపబడినవి ఇట్టిగ్రంథము తెనుగుభాషలో దొరుకుటదుర్లభము ఈగ్రంథము వైద్యులకేగాక అందరకును చాలాముఖ్యమైనదని మేము ఖండితముగా చెప్పగలము ఈగ్రంథరాజము అనేక గొప్పవైద్యులవల్ల ప్రతియింట నుండతగినదని పొగడ్తగాంచినది. ఇందు సుమారు 400 పద్యములు గలవు, వెల 0-8-0

జనోపకారిణీప్రెస్సు, ప్రొద్దుటూరు.